జై హింద్

# శ్రీ స్వాతంత్ర్య విజయము

లేక

(లుబ్ధగజాంకుశము)



బి. కోడూరు 

16—8—48

రచయిత

"ఆయుర్వేద భిషక్"

చిట్టిభొట్ల ఈశ్వరశర్మ




గ్రంథకర్త

చిట్టిభొట్ల ఈశ్వరశర్మ

# కృతిసమర్పణము,



గీ॥ శ్రీమహాలక్ష్మీ హృదయము న్జేరి మీరి
నృత్యమాడుచు ఆనంద నిత్యమైవ
సింప నెప్పెడు నోనరసింహా నీవు
హాయిగాగొను కృతిని జోహారు లివియె॥

గ్రంథకర్త

—* అస్మద్దూమ్మల పురుషస్తవము *—

సీ॥ శ్రీమించు రాయలసీమ యందలరాజు
నవ నందిమండలానంద భూమి
నందన రాట్సూను భండ నుఱడను నట్టి
అధిపనిర్మితము భండ్యాత్మకూరు
వాన యోగ్యం బన్న తన్నె బెట్టిన గ్రుహ
స్థక్రియా ధర్మసంస్థాపనంబు
ఉంఛ వృత్తి మహాత్వమొంది సాధించి వే
మించి వంశ సుకీర్తి బెంచినట్టి

గీ॥ భాగ్యవారాశి యా భరద్వాజ గోత్ర
పూజనీయుడు మామూల పురుష మూర్తి
చిట్టి భొట్లాఖ్యవరుఁ నాదు చిత్తమందు
వందనము జేతు సంతతానంద మొంద॥

—⁂ మాతృస్తవము ⁂—

శా॥ శ్రీగౌరీ పతిపూజల న్సలిపి సౌశీల్యాది సంసారముల్
బాగోగుల్ గమనించుచు న్సుతుల నిమ్మా ఈశ్వరాయన్న నీ
యోగారాబము బాసి పోయితివిగా నాబాల్యమం దమ్మరో
నే గావింతు నమస్కృతుల్ గొలుతు నిన్నే రామలక్ష్మాంబికా॥

...*** పితృస్తవము ***...

ఉ॥ నిక్కపు భక్తి చే మెలగు నీసహధర్మిణి పుత్రులిర్వురున్
అక్కట పుత్రికాద్వయము నంతమునొంద మహోత్క కాంతకున్
జిక్కక దుఃఖసాగరము జీర్ణమొనర్చి సుతుం డునైనన్
మక్కువ బెంచునీకిడె నమస్సులు వేంకట శేషధీమణీ॥

...( అస్మద్గ్రామ ప్రజాగుణస్తవము )...

ఉ॥ హిందువులు స్మహమ్మదు లహీన ముదంబున క్రైస్తవాదులు
పొందుగ సంఘసేవలను పూని ముదంబొనరించు మిత్రులన్
బందుగులట్లు నామదిని బయ్యపుకోడూరు సోదర ప్రజా
బృందము కెల్లవేళల సుబుద్ధియొసంగ మహాత్ముగొల్చెదన్.

[౫౧౦౯౪

# మనవి.

ఆర్యా !

1942 వ సంవత్సరముననే నీగ్రంథమును వ్రాయ నారంభించి 48 వ సంవత్సరమునం బూర్తియైనదనుట నామిత్రుల కెల్లరకును తెలియనిదికాదు. తదారభ్య అచ్చొత్తించుటకు ప్రయత్నించుచుంటినే గాని ఏలనో ఇంత కాలహరణమైనది. ఈ గ్రంథమును వ్రాయబూనినది నా పాండిత్యమహిమ ప్రపంచమున ప్రకటించి ప్రశిద్ధి నార్జించు ప్రయత్నంబెంత మాత్రము గాదు. ఆనాటి స్వార్థపరులు మానవరక్కసులు లుబ్ధులుగావించు క్రూర కుటిల రాజనీతిజ్ఞతకులోనై స్వార్థ రహితులును సత్యవాదులును స్వాతంత్ర్యప్రియులును ధర్మసంస్థాపకులును బడరాని అమానుష కృత్యములపాలై దాస్యశృంఖలములలో జిక్కి దాపత్రయ మొందుచు యుక్కిరిబిక్కిరులై యుండు యాదుస్సంఘటనమే నాయీ ప్రయత్నమునకు ముఖ్యకారణము. అంతట నా ఇష్టదైవమగు శ్రీలక్ష్మీనృసింహస్వామి కరుణాకటాక్షమర్థించి దన్మూలమున ఊహాకల్పిత నాటక రచననారంభించితినే గాని ఎచ్చట ప్రారంభించి ఎచ్చట సంపూర్ణమొనర్చవలయునను విచక్షణ మణుమాత్ర మూహించలేను. కవితా కౌశలముగాని, పాండిత్య ప్రభావముగాని, లేని ఈ రచన స్వార్థపరులు తొలగి స్వాతంత్ర్యము సిద్ధించువరకు పూర్తియొనర్చిన దాబరమేశ్వరేచ్ఛయే ఇందలి ఛందోదోషాది పదములకూర్పు నాపాండిత్య లోపమే. నాలోపమునకుతోడు ముద్రణమొనర్చు నాసోదరుల పొరపాట్లు సైతము నేను సమక్షములో యుండక వారికే యప్పగించుట ఆపొరపాట్లును నావిగా భావించితి. సహృదయులెల్లరు ఈ గ్రంథమును జదువ నారంభించుటకు ముందుగా ఈ గ్రంథాంతమున నుండు తప్పొప్పుల పట్టిక సవరించు కొందురని ప్రార్థన. ఇంకను అక్షరలోపములు గలవి దిద్దుటకు ప్రథమ ముద్రణము పూర్తియైనందున సాధ్యపడలేదు. ద్వితీయ ముద్రణమందు తప్పులు సవరింప సాధ్యమైనంతవరకు ప్రయత్నించెద. ఈ ప్రతులను విక్రయించుచు నాద్రవ్యము మాగ్రామమందు నూతనముగా స్థాపించిన గ్రామోద్ధారక యువకజనసంఘ సహాయమునకొసంగ నిశ్చయించితి. మీకొసంగిన ఈ శ్రమకు నా కృతజ్ఞతాభి వందనములు. సమస్తసన్మంగళాని భవంతు.

జై హింద్ గ్రంథకర్త.

శ్రీ ర స్తు

# పండితాభిప్రాయము



శ్రీయుత చిట్టిభొట్ల ఈశ్వరయ్యగారు రచించిన స్వాతంత్ర్యవిజయము అను పంచాంక పరిమితమైన ముద్రిత నాటకము నామూలాగ్రముగ జదివి సంతసించితిని ముద్రణదోషములు విరివిగానున్నవి. తప్పొప్పులపట్టిక బరిశీలించియే చదువుకొనవలసియుండును రచనోద్దేశ మమూల్యమైనది. ఈ కవికిది ప్రథమ ప్రయత్నమగుటచేఁ బద్యభాగములో నచ్చటచ్చటఁ గొన్ని శాబ్దిక దోషములు గానవచ్చును అయినను పాత్ర పోషణమునందుఁ గాని సంవిధాన నైపుణియందుఁగాని యీనాటకము మనప్రాచీన సంప్రదాయము ననుసరించి మిక్కిలి రసవత్తరముగ నున్నది దేశ కాలముల కెంతయు ననురూపమై పాఠక హృదయముల నతి శీఘ్రముగ నాకర్షించు నీ నూత్న దృశ్య కావ్యమాంధ్ర భారతికొక మనోజ్ఞ కంఠాభరణమై రాజిల్లుననుట కభ్యంతర మేమియులేదు ఈకవి శ్రీసుభాసు చంద్రబోసు (నేతాజీ) చరిత్రమును సైతము హరికథా రూపమునఁ గొంతభాగము రచించి యున్నాడు ఇట్టి రచయితల యుత్తమ కావ్యములను బ్రోత్సహించి యాంధ్రలోకము కృతార్థమగుఁగాక యని ప్రార్థించు చున్నాను.

ఏతత్కృతి పతియైన శ్రీనృసింహ మూర్తి యీకృతికర్త కాయురారోగ్య భాగ్యములనిచ్చి నిరంతరము రక్షించుఁగాక యని ప్రార్థించు చున్నాను.

కర్నూలు
21—10—1948

ఇట్లు
అనుముల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి

# 'జ్వాల' అభిప్రాయము.

మహాశయా,

మీ నాటకము చదివితిమి ఇతివృత్తము ఆధునికమై, నేటి సంఘము లోని దోషాలను చక్కగా బయలు పరుస్తున్నది.

సాఫీగా సాగు అనేక పద్యాలతో మీ నాటకము చదువుకొనడానికి బాగున్నది. మీనాటకముద్వారా ప్రస్తుత నాటకంకంటె మీలోని రచనా పాటవాన్నే మేమెక్కువ పాటిస్తున్నాము.

కాలానుగుణ్యమైన ఇతివృత్తం, శైలి, ఊంపోలతో ప్రతిభావంతమైన మీలేఖినినుండి బయల్పడే మీతరువాతి నాటకాలు చదువుకొనడానికీ ప్రదర్శనానకీకూడ పనికివచ్చి జనరంజకం చేస్తవని మాయభిప్రాయము.

జ్వా ల
23-10-48

శ్రీస్వాతంత్ర్య విజయమను దృశ్యకావ్యమును నేఁబరికించినాఁడ.

ఈనాటిక రచయితలు బ్రహ్మశ్రీ బయ్యావు కోడూరు గ్రామవాసులు చిట్టిభొట్లి ఈశ్వరశర్మగారు. వీరధునాతనాభిరుచుల నీకావ్యమును రచించిరి. స్వతంత్రభారత దేశమున నిట్టిరచనలు ప్రజాసామాన్యమునఁ బ్రబోధమున కావశ్యకములు.

ఈకవివర్యుల భాషాభిమానము రచనయందలి కుతూహలము ప్రశంసాపాత్రములు

ముద్రణ దోషము లధికముగ నున్నవి, ద్వితీయ ముద్రణమున సవరింపఁబడునని తలంచెద వీరికావ్యరచనము ప్రథమ ప్రయత్నమైనను సరళమై హృదయంగమముగ నున్నది.

ఇట్టి రచయితల కాంధ్రజాతి ప్రోత్సాహ మొసఁగుననియాశించెదను.

ఇట్లు
వై. రాఘవాచార్యులు.
సీనియర్ తెలుగు పండితుఁడు,
మునిసిపల్ హైస్కూలు, కర్నూలు.
24—10—48

## —♦ ఇందలి ముఖ్యపాత్రధారులు. పురుషులు ♦—

| | |
|---|---|
| శ్రీ విష్ణువు | (వైకుంఠదృశ్యము) |
| నారదుడు | (కథానాయకుడు) యోగి |
| లబ్ధ రాజు | (యువరాజు) |
| సుధర్ముడు | (మహారాజు) |
| జంబుకేశ్వరుడు | (ప్రధానమంత్రి) |
| బ్రహ్మమూర్తి | (రెండవ మంత్రి) |
| వంది | (మూడవ మంత్రి) |
| శూలపాణి | (ఇంగ్లీషు డాక్టరు) |
| గోపాలాచార్యులు | (ఆయుర్వేద డాక్టరు) |
| శంకరశాస్త్రి | |
| బాలక్రిష్ణమ్మశెట్టి | (పల్లెటూరి నివాసులు) |
| పెరుమాళ్ రెడ్డి | |
| మటిక్-సాహెబ్ | |
| ఆనందమూర్తి | బ్రహ్మమూర్తి కుమారుడు (10 సం॥ బాలుడు) |
| కార్కు | (రాజభటులు) |
| మార్కు | |
| పోలీస్ సబ్ ఇనస్పెక్టర్ | |

## —♦ స్త్రీలు ♦—

| | |
|---|---|
| శ్రీ లక్ష్మి | (విష్ణువుభార్య) |
| శాంతమ్మ | (జంబుకేశ్వరునిభార్య) |
| భారతీదేవి | (బ్రహ్మమూర్తి భార్య) |
| సుగంధలత | (ఇంగ్లీషుడాక్టరుభార్య) |

శ్రీ రా ము లు.

శ్రీ విఘ్నేశ్వరాయ నమః

# శ్రీ స్వాతంత్ర్య విజయము

అను

# లుబ్ధగజాంకుశం.



## —(* ప్రథమాంకము. *)—

(శ్రీ వైకుంఠమున విష్ణువు శయనించి యుండ పాదములవద్ద లక్ష్మీదేవి కూర్చొనియుండును తెరయెత్తబడును.)

నారద:— (పాటపాడుచు) (ప్రవేశించి) వైకుంఠవాసా నమస్తేన్నమః

శ్రీవిష్ణువు:— మనోవాంఛా ఫలసిద్ధిరస్తు నారదా కూర్చొనుము.

నారద:— ధన్యోస్మి ధన్యోస్మి (అనికూర్చొనును)

లక్ష్మి:— దేవా ఏదేశసృష్టి చేయల యోచించుచుంటిరి? సృష్టిస్థితి లయమూర్తులు మీరింత యాలోచించుటకు హేతువేమి?

విష్ణువు:— ఆలోచనయా. నీవు పేర్కొన్న సృష్టిస్థితిలయములలో సృష్టిస్థితులు గడచినవి. ఇకలయకాల మాసన్నమైనదా యని యోచించుచుంటి.

నారద:— లయమా! కల్ల పరమ పతివ్రతామతల్లులును సకలధర్మ అర్థ వీర సత్య సంధాది మహర్షి బృందములు జనించు భారతావనిపై ప్రళయమంకురించునా

ఉ॥ శాంతికి మూలమాయిల విశాలసుశీలగుణాలవాలు ర
త్యంత పరోపకార సుగుణాంచిత కోమలపత్రసూన సు
స్వాంతులు నింపుసొంపొదవు సంపదనింపెడు సారభూత వే
దాంత రసంబు గ్రోల ప్రియలయంబులు వారలనంట నేర్చునే॥

దేవా భారతావని యందు ప్రళయ మంకురించుననుట ప్రకృతి విరుద్ధము. అది జరుగనేరదు.

లక్ష్మి:- నాథా మీరీ కేవల భక్తవల్యూలనే నిక్కమందురా. పరధాన్యాంధకార భద్ధులై పాపభూయిష్టమగు పరధనాసక్తులై ప్రజాహింసకులు చెలరేగిన భారతావని యందు ప్రళయ మంకురింప కుండునా. మనోవల్లభా

ఉ॥ శాంతములేదు సీలమదిసాగదు సత్యముగానరాదు ధ్వా
మంతము నున్నగన్న బెడమార్గమె జూపును సంఘమున్న రా
ధ్వాంతములిన్న బెద్దలవిధానమె దూరుచునుందురెన్న దు
స్స్వాంతుల నస్వతంత్రుల నసాధ్యములై బ్రళయంబులంట వే

విష్ణువు:- వెర్రిదానా నేను భక్తపరాధీనుడనని ఎరుంగవా. భక్తుడే నేను నేనేభక్తుడ (నారదుంజూచి) నారదా ప్రత్యుత్తరమాలోచింపుము.

నారద,- దేవ దేవా సర్వాంతర్యాములగు మీకాలోచన దెల్ప నే నెంతవాడను.

కృష్ణువు:- సందేహించకుము ఇది ప్రపంచ సమీక్ష తెలిసినదా

నారద:- మహాప్రసాదము.

లక్ష్మి:- నారదా భారతభూమి యందనేక మార్పులుత్పన్నమైనవి సత్యసీల వీరత్వాదులు నసించినవి అందుచే నీ యూహ ఇప్పటి భారత ప్రజల కన్వయించవు

నారద:- లోకమాతా మీరీవైకుంఠ మలంకరించి భూలోక మీక్షించుచుండుడు. నేనొక యోగిరూపమున భారతావనిం బర్యటన జేయుచు సర్వము మీ కెరింగించి భారతీయుల ప్రతిభా మహాత్మ్యము ప్రపంచమున వెదజల్లి మీ సందేహముదీర్చెద ఆజ్ఞయొసంగుడు.

లక్ష్మి:- (విష్ణువువైపుజూచి) ప్రియా. ఆజ్ఞ యొసంగుటలో మీ అభిప్రాయమేమి.

విష్ణువు:- నీ యభిప్రాయమే నా యభిప్రాయము. (నారదుంజూచి)
నారదా సందేహానివృత్తికై భూలోకంబున కేగుము-విజై యీభవ పోయిరమ్ము.

నారద:- (పాటపాడుచు వెళ్లును తెరవ్రాలును).

(ప్రవేశము)

నారద:- (పాటపాడుచు భువిబరికించి) జననీ భూదేవీ

సీ॥ ముల్లోకములకెల్ల మూలమీవనిబుధుల్
వేనోళ్లగొనియాడ వెలసినావు
వెలసినదాదండవలయ రూపముదాల్చి
బహుఖండముల రీతిబడసినావు
బడసి భూమండలంబందు మేటియనంగ
భారతావనిపేర బరగినావు
బరగిధీరుల చాలబలశాలురగని గీ
దేశమ్ములగ కీర్తిదేలినావు
తేలి స్వాతంత్ర్య విజయవై తేజరిల్లి
నట్టి నిను నేడు దాస్యంబునందు నిల్పి
దుష్టబరిపాలనములూడి తొలగునమ్మ
బరమకల్యాణి జగదంబ భారతాంబ

(తెరవైపుజూచి)

వైకుంఠవాసా అల్లదే గావచ్చు పట్టణమరసి యందలి వృత్తాంత మెరింగించెద. (పాటపాడుచు నిష్క్రమణ) రాజద్వారము ఇరువైపుల కార్కు-మార్కు అనుభటులు నిల్చుకొని యుందురు.

(తెర ఎత్తబడును.)

నారద:- (యోగిరూపమున ప్రవేశించి ద్వారపాలురంజూచి)
అయ్యలారా మీరెవరు?

మార్కు:- అతనిపేరు కార్కు. నా పేరు మార్కు.

యోగి:- ఓ హో! యీ పట్టణపాలకు లెవరు.

కార్కు:- పాలకులపేరు సన్నాసుల కేంనయ్యా, బిచ్చముకొగి బయల్దేరి
చచ్చేవానికి సానిసుద్దు లెందుకు. సాగు ఊ సాగు

యోగి:- ఏమీ? అకారణ హాస్యమా?

మార్కు:- ఆకారణమట్లుండనీ. ఊరిపేరే తెలియనివానికి దారిమొట్ల దెలిసెనోయ్.

కార్కు:- ఓరెయ్. సన్నాసులతో సనమాడకూడదుకూ. సాలా సిక్కులుంటాయ్

మార్కు:- (చెంపలు వేసుకొని) తప్పు. తప్పు చమించు బాబో ఇది శకరీపురం. సుధర్మ మహారాజు పాలన ఇది రాజగృహం యువరాజు లబ్ధపతి దైసేయ్. బిచ్చంలేదు గిచ్చంలేదు, కదులూ. ఊ.

యోగి:- (తనలో) రాజు సుధర్ముడు సరియే, యువరాజు లబ్ధపతియా! (ప్రకాశముగా) ఈపేరెందైననులేదే విచిత్రముగానున్నది.

కార్కు:- విసిత్రమేలనయ్యా నసిత్రిమే, మొదలంట సెప్పినగాని నీమెదడున కెక్కదు. మారాజు తండ్రి. శంబురాజు అప్పుల పాలై దుఃఖములో నున్నప్పుడు. మాలబ్ధపతిరాజు పుట్టే పేరు పెట్టేనాడు పాతిల్లు రిపేరి సేచుంటే పెద్దధనం దొరికింది దాంతో అప్పులు చప్పులుతీరి ఆచ్చి పాచ్చి రాజ్యం గీజ్యం అంత దక్కిందని కుమారుని అవట్టించాక కొసగు మిగిలిందే రాజ్యం అదేలబ్దం అంచుకే ముద్దుగా చిన్నకొడిక్కి లబ్దవతియని పేరు పెట్టినాడు. తెల్సిందా

యోగి:- ఆ. ఇక సర్వమూ తెలియును. (దివముపరికించి) రమా మనోహరా.

ఆ॥వె॥ పురము చక్రిపురము పురపాలక సుధర్మ
వర్మ దమ్ముడు లబ్ధవరకుడు దెలిసె
కార్కు మార్కులు భటుల్ గలసిన రాజ్యాన
బరగు నాట్యమింక జరుగు వినుడు.

(పాడుచు నిష్క్రమించును) తెరవాలును.

రాజస్థానము మంత్రులతోసహా సుధర్ముడు కూర్చొనియుండ తెరయెత్తబడును )

యోగి:- (పాడుచు ప్రవేశించును)

సుధర్ముడు:- (యోగినుద్దేశించి) అయ్యా కూర్చొనుడు. మీనివాస మెచ్చట

యోగి- (కూర్చొనుచు) వైకుంఠపురము.

సుధర్మ:- (ఆశ్చర్యముగా) వైకుంఠపురమా!

యోగి:- ఔను, సరంతర భగవద్గీతా పారాయణుల కావైకుంఠ మేవాస స్థానము. ఇందలి ఆశ్చర్య మేమున్నది.

సుధర్ముడు:- ధన్యోస్మి, ధన్యోస్మి, భవద్దర్శన మహిమచే నేనును నామూలమున రాజ్యప్రజలును ధన్యులమైతిమి. మునీంద్రా,

ఉ॥ శ్రీలోధవంగ దైవపద చింతనజేసెడి మిమ్ముబోంట్లు నా
బాలన జూడవచ్చుట లపారముదంబిక నామనంబునిక
బోలిన బెద్దనేయుడుగ బూనిన ప్రశ్నలనైదు దెల్పెదక
జాలుగదెల్పుమయ్య తగుసారములైన సదుత్తరంబులక
యోగీంద్రా! తెల్పమనెదరా?

యోగి:- అగత్యము వెల్లడించుడు. తెలసినంతవరకు దెల్పెద

సుధర్మ:- సరిరే. ప్రపంచములో మూలమైన దేది?

యోగి:- ధనము.

సుధర్మ:- తులలేని తూక మేది?

యోగి:- సత్యము.

సుధర్మ:- అన్నిటికన్న అత్యుత్తమమైన దేది?

యోగి:- అహింస.

సుధర్మ:- ఎన్ని విడిచినను విడువరాని దేది?

యోగి:- ధైర్యము.

సుధర్మ:- యెంత ఈదినను అంతు దొరచని దేది?

యోగి:- సంసారసాగరము ఈపంచసూత్ర సుసాధకుడే పరిపాలించ దగు ప్రభువు.

జంబుకుడు:- (దిగ్గున లేచి) కావచ్చునుగాని నీ ప్రత్యుత్తరము లిప్పటి ప్రపంచమున కనుకూలింపవని నా నమ్మకము.

బ్రహ్మమూర్తి:- జంబుకేశ్వరా? అందరము శిష్యులమే. పెద్దలకు పెద్దవైనందున అంగున కనుకూలించు ప్రత్యుత్తరములు మీరు చెప్పుడు.

జంబు:- నీకడ నేనేపాటి పెద్దనయ్యెదను? సర్వేశ్వరుని యాజ్ఞయైన నీవడుగకముందే చెప్పియుందును.

సుధర్మ:- ఏల వివాదము. సదుత్తరములైన సన్మానించెద సందేహములు దీర్చుటకందరకు ఆజ్ఞయిచ్చితి, మీ మీ అభిప్రాయములు వెల్లడించుడు.

జంబు:- (తొందరగా లేచి) నే వెల్లడించెద [1] ప్రపంచమునకు మూలము ధనమే. అది అందరము ఒప్పుకొనదగ్గదే. [2] తులలేని తూకమైనది దేశసామ్రాజ్యము [3] అన్నిటికన్న అత్యుత్తమమైనది. ఆగ్రహించువారి ననుకూలపరచుట [4] యెన్ని విడిచినను విడువరానిది పట్టుదల [5] ఎంతయాడినను అంతుదోచనిది ప్రపంచప్రజల దురాశ. ఇట్టి దురాశా పరులమట్టు పెట్టుటే నేటి ప్రభుత్వధర్మము.

బ్రహ్మమూర్తి:- (తటాలున లేచి) ఆ! అవునవును? మీకు నుడివిన నయిడవదియగు ఆదురాశయే మీకీ ప్రత్యుత్తరముల భోధించినదికాబోలు

జంబు:- బ్రహ్మమూర్తి! మాటలు మితిమీరుచున్నవి. నీకేల ఈ యధిక ప్రసంగము?

గీ॥ రాజ్యతంత్రంబు లడుగుచో రాజనంతు
నచ్చు జెప్పెడి భారమ్ము నాకు వలదు
ఇంతకును లేక మోహిగు నీ గొంతెత్తు
నీచమధిక ప్రసంగమ్ము నీకు నంతు.

బ్రహ్మమూర్తి:- ఏమీ? యేమంటివి? అధిక ప్రసంగములు నీ ప్రత్యుత్తరముల సారమే?

చ॥ తలచెడి మాటలాడెదవు దాలిమి నుంతయు లేక పెద్దవై
చలమని కాలు దువ్వెదవు జాలి యొకింత లేక చక్రముల్
బలమది తగ్గె మేనమతి పారదు వేసను దృష్టి మ్రగ్గెనిక
దలచుచు నీగుణంబు లెగ తాళిగ నవ్వెదు రింక జంబుకా.
ఇక మతిచెడి మర్యాద పోగొట్టుకొనకుము.

వంది:— (కోటాలున లేచి) (రాజునుద్దేశించి) ప్రభూ, యేమట్లూరకున్నాడవు. రాజస్థానము రణరంగముగా మారుచున్నది ఆలసించిన అశాంతి మితిమీరుచు.

సుధర్ముడు:- బ్రహ్మమూర్తి

గీ॥ శాంతినూనుము కోపమ్ము సాగదిపుడు
బాల్యమిత్రత పాటింపు బ్రహ్మమూర్తి
జంబుకేశ్వర పెద్దవు చదువనేల
యాగ్రహము బూనరాదెప్డు అనువుగాదు.
ఇక మీ మీ యాగ్రహములు చాలింపుడు.

జంబు. రాజా? బ్రహ్మమూర్తి నీకు ప్రియ మిత్రుడైన గానిమ్ము మంత్రి పనికిమాత్ర మిత డనర్హుడు ఇంకొకరి నియమించుకొనుట మేలు. లేదేని రాజ్యతంత్రమునకే ప్రమాదము సంభవించును. యోచింపుము.

బ్రహ్మ సరియే? పరిపాలనాధిపతి రాజు తనకు నచ్చిన వారినే మంత్రులుగా నియమించుకొనును నీవేల లేని యధికారమును చలాయించు చుంటివి ఇది నీ గర్వవచనమా.

జంబు ఏమంటివి? ఔరా? పొగరు తలకెక్కి మాటలాడెదవా.

శా॥ ఔరా గర్వమటంచు గూశెనవుగా అంగుండవై మూర్ఖుడా
ఏరా రాజ్యము నేలువారెవరో నీవే రాజునంచెంచి తో
ఈ రాజ్యంబున రాజులెల్లపుడు నాయిష్టాను వృత్తాత్ములే
నీ రాజిప్పుడు నామమాత్రుడె జుమీ నేర్పుల్ జెల్లవిచ్చోటునన్.

సుధర్మ జంబుకేశ్వరా? ఏమీ? రాజు నామ మాత్రుడంటివా?

గీ॥ భూమియను దెట్టిమార్పు నెబ్బెట్టినేనీ
సేవమాయుచు బ్రజలను జేరదీసి
హారి యిష్టార్థములు దీర్చవలను వతని
నామకార్థపు రాజేలనవ్వు చేటు.

బ్రతుకు కొరకా ఈబద్బన బొమ్మాధిపత్యము

జంబు నీచముగా దోచిన రాజ్యము నీవనుభవింపజాలవు.

బ్రహ్మ సర్వాధికారము తమదేనా? రాజున కాయధికారములేవా?

జంబు ఆమాట మొదటనే వెల్లడించితి సర్వసైన్యములు నాచేగలవు.
మీ. మీ బెదిరింపులు నన్నేమియు చేయజాలవు

బ్రహ్మ (కోపముతో లేవబోవును)

సుధర్మ బ్రహ్మమూర్తీ! ఇది మాటలాడుటకు సమయముగాదు.
జంబుకేశ్వరా! వివాదముతో బనిలేదు నీ ఇచ్చవచ్చిన రాజునే
నియమించు కొనుము. ఇట్టి కీలుబొమ్మాధిపత్యమునకు
నమస్కరించి నేవెళ్లిపోయెద.

జంబు మీ యిష్టానుసారమే వెళ్లవచ్చును (యువరాజువైపుజూచి)
యువరాజా? .ఇక సింహాసనము నీ స్వాధీనము చేయనెంచితి.

బ్రహ్మ (డిగ్గునలేచి ఖడ్గము దీయుచు) ఇది ధర్మవిరుద్ధము అధర్మము
సహింపజాల.

సుధర్మ బ్రహ్మమూర్తీ? సాహసింపకుము. నాయాజ్ఞ

బ్రహ్మ (కత్తి నేల జారవైచి తలవాల్చుకొని యుండును)

జంబు మీకు ధర్మముల బోధించువాడు సన్యాసియే, తెలియని ధర్మ
ములు దెలిసుకొనుడు.

యోగి అయ్యా! ధర్మకాల మంతరించి అధర్మ మాసన్నమగుట
కీ యహంకార ప్రభుత్వమే మూలకారణము.

జంబు సన్యాసివి నీ ప్రవేశమే ఈ జరిగిన కార్యమునకు మూలము.

యోగి జరిగిన కార్యమేకాదు. ఇక జరుగబోవు జగత్కల్యాణమునకు సైతమయ్యదియే మూలము.

జంబు నీ ధర్మములు విన్న రాజాములు నీవుచు ఇచ్చటనుండ బనిలేదు వెళ్లవచ్చును.

యోగి సంతోషము. ఇట్టిపాప భూయిష్టులగు అధర్మ వర్తనుంచెంత కూర్చొనుట పాపదాయకము వెళ్లెద (లేచి దీపము పరికించి) వేదాంత వేద్యా,

సీ॥ ధర్మపాలనజేయు ధరణీశ్వరుల నెల్ల
మోసపుచ్చుచు దేశములను గెల్చి
గెలిచినంతనె దానగలిగె దుర్ధనకాంక్ష
మేటి యాకాంక్షలో నాటుకొనియె
నాటుకొన్నది మొదల్ నడిపించె దుర్బుద్ధి
సద్ధర్మ పాలనల్ సాగనంపె
సాగనంపిన దాది శాసనంబులగూర్చి
కూర్చి నిరంకుశగుణము నేర్చె
నేర్చి అజ్ఞానివలన నోదార్చునితడు
జంబుకేశ్వరుడన వృక్ష జంబుకంబు
లుబ్ధతయె వీని దుశ్చేష్టలబ్ధమిటుల
మార్చె రాజును మంత్రిని మరువకండి.
(అని పాటపాడుచు వెళ్లును)

సుధర్మ (లేచి) సోదరా. ఇంతవరకు మాపైనున్న రాజ్యభారము గైకొని సుఖముగా రాజ్యపాలన మొనర్చుము.

జంబు (లేచి) రాజరికపుహక్కు నీకుగాని నీకుటుంబ జనితులకుగాని నిమిత్తముండరాదు. నీస్వహస్తమున హక్కువిడుదల పత్రము వ్రాసి యివ్వవలయును.

సుధర్మ అగత్యము గైకొనుడు. యేదీ పత్రము?

జంబు (కాగితము నిచ్చును)

సుధర్మ (వ్రాతనభినయించి కిరీటము ఖడ్గముతోసహా జంబుకేశ్వరున కప్పగించి వెళ్లి పోవును)

జంబు (యువరాజునకు కిరీటము: ఖడ్గము చేతికిచ్చి) లబ్ధరాజా? నేటినుండి సర్వసామ్రాజ్యాధి పత్యము వహించుము.
శ్రీ శ్రీ. శ్రీ. లబ్ధమహారాజుగారికిజై. (అని మూడుసార్లు అనును)

బ్రహ్మ (లేచి నిల్చుకొని) ఔరా? యేమి కాలవిపర్యాసము? లబ్ధరాజా, అన్యాయపు కార్యమూని రాజ్యము తలకు జుట్టుకొంటివా?

సీ॥ ధర్మరాజునువోలి ధర్మపాలన జేయు
ధర్మానువర్తి సుధర్మమూర్తి
కోపమూనక ప్రజల్ కోరిన యువిదీర్చు
ధర్మానువర్తి సుధర్మమూర్తి
అన్య రాజ్యంబుల నార్జింప నొల్లని
ధర్మానువర్తి సుధర్మ మూర్తి
నాస్తికులగు వారినేస్తంబు లొప్పని
ధర్మానువర్తి సుధర్మమూర్తి
నిట్టి సద్ధర్మముల దిట్ట నీడ్చి వైచి
నట్టి బందవు దస్యుండై బుట్టి తౌర
కపట హృదయుడ నీరాజ్యకాంక్ష మనునె
భ్రాతృవైరివి నినుజూడ పాప మొదవు.

ఛీదురాత్మా, జంబుకా.

శా॥ సౌజన్యంబును మంటగల్పితిరి నీరాజ్యంబు కాలింపనా
రాజన్యం వదలించి వంచకులరై వ్రాశిచ్చి పొమ్మంటిరా

పూజార్హు డెటులబ్ధరాజగును నేభూదేవి బాలింతురో
బెజారై విలపించి దన్నుకొనరో. వీక్షింతు మీజాడలగ.

ఓరీ? లుబ్ధపిశాచమా.

గీ॥ స్థిరముగా నిల్చు ధనమును చిత్తవృత్తి
నంతరించెడు కాలము చెంత జేరె
కొంతకాలంబె ఇక మీదుకుల్కు లెల్ల
ప్రజల సంఘము లేకమై బరగువరకె.

జంబు నీచాలాపములు మిఱి మీరిన నీచేతులు సంకెళ్ల పాలగును.
నచ్చకున్న చచ్చినట్లు వెడలిపొమ్ము? రాజభటులారా,
(భటులు ప్రవేశింతురు) ఈచండాలు నిటునుండి సాగనంపుడు.

భటులు (బ్రహ్మమూర్తిని భటులు ఈడ్చుకొని వెళ్లుచుండగా)

బ్రహ్మ హా! మిత్రమా! సుధర్మా (అని నేలపడును. ఈడ్చుకొని
వెళ్లుదురు)

తెరవ్రాలును.

ప్రథమాంకము సమాప్తము.



## —॰॰ ద్వితీయాంకము. ॰॰—

…॥* జంబుకేశ్వరుని గృహాంగణము *॥…

జంబు రాజభటులారా? (భటులు ప్రవేశింతురు) మీరీడ్చిన పిశాచ
మేమయ్యెను.

కార్మి స్వాధీనముతప్పి బాధలో యున్నాడండీ పాపము.

జంబు పాపమా? స్వయంకృతాపరాధము. పాపమా? ఊఁ ఇక వాడు బ్రతికియుంచిన రాజ్యమునకు ప్రమాదము తప్పదు. మీరీవిషము తీసుకొని వెళ్లి సాహసముచే వాడు మ్రింగునటుల చేసి రండు. మీకోరిన బహుమతు లొసంగెద ఎవ్వరికేని తెలిసినా మీశిత్తుకలెగర బోవును. జాగ్రత (విషముగిన్నె నిచ్చును) ఊఁ?

(నిష్క్రమణ తెరవ్రాలును.

తెరయెత్తగా పెరటి బయలునందు బ్రహ్మయమూర్తి నిద్నపోని నేల పడస్సైచి)

కార్క- గట్టిగా పట్టురా?

మార్క- అబ్బా? నాసేతులాడవురా? బిడ్డలు గల్లోన్ని పాపం

కార్క- యేడ్చావులే? యాడికొచ్చినా యెదాంతాలేనా పాపం వున్నోం వటోయ్ పట్టు ముక్కు బిగబట్టు.

(అని నోటవిషము బోతురు. తెరవ్రాలును.)

తెరయెత్తగా రాజభటులు మార్గము తొందరగా కార్క మార్కలు వెళ్లుచుందురు. యోగి వారలకు యెదురగును.

కార్క మార్క- భయమునభినయింతురు.

యోగి ఆర్యులారా? ఏల మీరిట్లు భయపడుచుంటిరి.

కార్కమార్క రేమీ లేదబ్బా. (అనిపరుగెత్తి వెళ్లిపోవుదురు)

యోగి (స్వగతము) నన్ను జూచివీరింత తబ్బిబ్బులాడుటకు కారణమేమైయుండవచ్చును. (అనిగ్రుప్పినభియించి) ఆహా ప్రమాదము ఇంక సైనేగవలయు. (అనివెళ్లును)

కార్క- అబ్బ! బ్రతికితిమిరా బాబు.

మార్క- యేంబతుకురా. బహుమానం కొరకు. బలవంతముగా నంపితివి నామనస్సు నాలో లేదోయ్.

కార్య. యీలాంటి యేదాంతాలు. సూశాంతే బహుమానంలో భాగం తీసుకోవ్. యెల్లవోయ్. యెల్లియెర్రి మొగమా

(నిష్క్రమణ)

(బ్రహ్మమూర్తి గృహము. భారతీదేవి గౌరిపూజ సేయుచు పాటపాడు చుండగా పాటపూర్తి అయిన పిదప. బాటసారి ప్రవేశించి)

బాటసారి అమ్మా, భారతీదేవి, మీభర్తగారు, బ్రహ్మమూర్తి పెరటి బయలులోపడి పొరలాడు చున్నాడు గొప్ప ప్రమాదముగా నున్నది.

భారతి (దిగ్గున లేచి) నాపతియా! బ్రహ్మమూర్తియా! ఇదినిజమా! అన్నా పొరబడు చుంటివా?

బాట నీవద్ద అబద్ధమాడుదునా. తల్లీ.

భారతి తల్లీ గౌరీమాత (అనినమస్కరించి తొందరగా. వెళ్లును.

(తెరవ్రాలును)

(తెరయెత్తగా ఆనందం పలకపుస్తకములు చంకనిడుకొని వెళ్లు చుండును. వెనుకవైపు ఒకబాలుడు తొందరగా ప్రవేశించి)

బాలుడు ఆనందమూర్తి! ఆనందమూర్తి మీతండ్రిగారు పెరటి బయలులోబడి ప్రాణము విడిచినాడని, అందరుగుంపులై యున్నారు. మీఅమ్మ యేడుస్తు నిన్ను త్వరగా రమ్మన్నది పోవుదము రమ్ము

ఆనందం (పలకపుస్తకములు జారవిడిచి) నాతండ్రిగారా?

(అనితొందరగా వెళ్లును)

తెరయెత్తగా.

(భారతీదేవి తొడలపై తలనిడుకొని బ్రహ్మమూర్తి నేలబడి యుండును. భారతిదేవి కన్నీరు తుడుచు కొనుచుండును)

ఆనందం (ప్రవేశించి) అమ్మా! అమ్మా! (తల్లినాలింగనం చేసుకొనును)

భారతి ఆనందం నా ఆనందం. (అతిదుఃఖించుచు)

యోగి (పాటపాడుచు) అమ్మా, యూరడిల్లుము. నీభర్త కేమియు ప్రమాదము లేదు.

భారతి (తిన్నగాలేచి చేతులు జోడించుకొని) యోగీంద్రా, మీ ఆశీర్వచనము నిజమా. తండ్రీ. తండ్రీ. నీవేదిక దిక్కు

(అని యోగి పాదములపై బడును)

ఆనందం (చేతులు జోడించుకొని) స్వామీ! నాతండ్రిని బ్రతికించుము నీయాజ్ఞ యగువరకు నీ పాదుకలు మోయుచు, నీ వెంట దిరిగెద స్వామి (అని పాదములపైబడును.)

యోగి అమ్మా! భారతీదేవీ ఆబ్బాయీ ఆనందమూర్తి, బ్రహ్మ మూర్తి తప్పక జీవించును. నా మాటనమ్మి మీరు ధైర్య మూనవలయు లెమ్ము (యిరువుర లేవనెత్తి) అమ్మా

ఉ॥ ఆపదలేదికోటికి ప్రయాసమునన్ బడికుందెదమ్మ నీ
ప్రాపున నిల్చి నీలమదె ప్రాణభయంబును దీర్చునింక సం
తాపము మానుమమ్మ వనితామణి భారతసాధ్వి చెంత నే
పాపములైన మాయమగు భారముదోపవు భారతీమణీ.

భారతీ (చేతులు జోడించుకొని) మునీంద్రా! నాపతిలేచి నాతో ఒక్కమాటైన బల్కువరకు హృదయము శాంతమూనజాలదు.

సీ॥ పతిసేవ భారతసతికి మూలధనంబు
పతినాడు దైవమో పరమ పురుష
పతిభక్తి ఇహపర పావనంబగుముక్తి
సహజ సంపదగాదె సాధువర్య
పతిలేక బ్రతికిన ఫలమేమి యిలలోన
దిక్కెవ్వరయ్య వోదీనపాల
పతియాపదలజిక్కి బరితపించెనుకట్టి
యోచన దోచకో యోగిచంద్ర.

(కొడుకు నాలింగనము చేసుకొని)

గీ॥ ఎందుబోవుద మానంద మెట్టులింక
బలుక డొక పలుకు-మీతండ్రి బ్రహ్మమూర్తి
(యోగి నుద్దేశించి)
జడలికగ మేని బాధల బడెడువార్తి
దీర్పుమో దేవడలతు మీదివ్యకీర్తి
(అని యోగిపాదములపై బడును)

ఆనందం (తల్లిని లేవనెత్తి కష్టముపట్టుకొని బర్తిమాలుచు) అమ్మా తాతగారు దైవము వోలెతటస్థ మైనారు. తండ్రిగారు తప్పక జీవించుచు. సిదుఃఖము మానుముతల్లీ, నీకన్నీరు జూచిన నాకడుపులో కలవర మెత్తుతుంది.

అను బంధము.

(తల్లిపైటచెరగుతో కన్నీరు తుడుచును)

భారతి నాన్నా! మనసు నిల్వదురా?

ఆనందం మనసు నిల్వకున్న మనం చేసేపనికే యిబ్బంది. అమ్మా, నామాటవినవూ, పోనీ తాతయ్యగారి మాటైనా వినవూ తల్లీ.

భారతి తాతగారి మాట మనకు వేదవాక్యముదండ్రీ. దుఃఖము భరింపలేక తొందర పడుచుంటి (కన్నీరు తుడుచుకొనుచు భర్తకు శైత్యోపచారములు చేయుచుండును)

ఆనందం తాతయ్యా? తండ్రిని చూచి తగు చికిత్స చేయరా?

యోగి (బ్రహ్మమూర్తి దగ్గరకువెళ్లి పరీక్షించి) ప్రాణభయంలేదు. యిది విషజ్వరరోగము. నీవు త్వరగా వెళ్లి మంచి వైద్యునిచటకు వచ్చునట్లు చేయుము తల్లీ మేమిరావురము ఇందే యుండె దము పోయిరమ్మా.

భారతి (భర్తపాదములకు నమస్కరించి వెళ్లును)

(తెరవ్రాలును)

మూఁడవ రంగము.

జంబుకేశ్వరుని గృహము భార్యకాంతమ్మ అద్దముచూచు కొనుచు శృంగారము చేసుకొనుచుండును.

భారతి (ప్రవేశించి కన్నీరు తుడుచుకొనుచు దీనతతో) కాంతమ్మ గారూ. కాంతమ్మగారూ.

కాంతమ్మ ఆ. ఎవరక్కడ. ఉండండి వస్తాను. (అద్దముతో సహావచ్చి) ఓహో! భారతమ్మగారు బయల్దేరటం నాకు ఇంతకుముందే తెలియును.

భారతి మీ కెట్లు తెలిసెనమ్మా?

కాంత మెల్లగా నదవా?

తే. గీ. నీమగడు మంత్రిపదవి నాసీటగల్పి
రాజుకుఁ దనబుద్ధియే రగులుకొల్పి
పెట్టి వేదాంతముల బడి వెతలనొంది
పోవుచును ద్రోవలో బడిపోయె జాణా.

ఔను బ్రెయిన్ అఫెక్ట్ అయినవాడు బ్రతుకునా

భారతి శివ; శివా! (అని చెవులు మూసుకొనును)

కాంత ఎందుకేడుస్తావు. వెఱ్ఱిదానా, అతని అంత్య క్రియలు పూర్తి చేసుకొని తొందరగా రా పో. అతడు బ్రతుకుటసున్న. నిన్నుద్ధరించుట అంతకుసున్న.

భారతి అవల నన్నేమిచేయ మనెదవు.

కాంత నిన్నేమి చేయమనను విడోమ్యారేజ్ తెలియుదూ నీక్షేమము కొరకే చెప్పునది.

భారతి ఆయన అంతరించిన నాకీయాశ లెందుకూ?

కాంత ఈశ్మశానవైరాగ్యం చింతవరకే, తరువాత తాటాలపాలై తాకులాడి నీకోటి వాండ్లెందరో ఏముసలి ముండాకొడుకు నంటగట్టుకొని ఏడుస్తున్నారు. అందుకే తొందరగా మేల్కొనుమని చెప్పునది.

భారతి ఏమీ? నీవనునది మఱియొకనిని వివాహమాడు మనియా,

కాంత ఎంత పిచ్చిదానవే, వాడుపోతే మరివకడు కాకపోయిన వాడే మరలివస్తాడా?

భారతి నోరుమూయుము. అపశకునపుపక్షి. పరిశుద్ధ భారత నారీమణి వలె నీగుమ్మము తొక్కితి. ఇంత సర్వసంకర స్త్రీవని తెలియక, పోయె పాపీ.

ఉ॥ నీచపు మాటలాడుటలు నీదగు నీచులచేత చెల్లదు
ర్వాచకమైన కూతలిః వాగుట ప్రేలుట లాపుమోసి పై
శాచము నీదుమోసముల సారముదోచక చేతులొగ్గి నే
యాచకినైన నావిభుని యాపద బాపకిటంచె ఘాతకీ.

(స్వగతము) ఛీ యీనీచురాలి చెంత కాలహరణమయ్యెనే, నాభర్త ఎంత పరితపించు చున్నాడో కదా. నేనిక వెళ్లెద (పోబోవ)

కాంత (అడ్డువచ్చి) రాస్కెల్ ఆగు నీవన్న మాటకు ప్రతిఫల మనుభవింపక పోయెదవనుకొంటివా. (ప్రక్కతిరిగి) ఎవరక్కడ (భటులు ప్రవేశింతురు) దీనికి పిచ్చియెత్తినది ఇది పట్టణమున తిరుగుచుండిన ప్రజలకు హానికరము దీనిని రేపుదయము పిచ్చిహాస్పత్రిలో జాయిన్ చెయ్యండి జాగ్రత (అని చీటి వ్రాసి భటులకొసంగును)

భారతి (ఏడ్చుచు) అమ్మా! అమ్మా! ఒక్కసారి నాపతిని జూడనిమ్మా. తల్లీ, నీ పాదములంటి మ్రొక్కెద (అనిపాదములపై బడును) కాంతమ్మ కాలితో ప్రక్క త్రోయును.

కాంత ఏమట్లూరకున్నారు (భటులకు సైగచేయును)

భారతి హానాథా! నాథా!

[భటులులు భారతినీడ్చుకొని వెళ్లుదురు. తెరవ్రాలును]

తెరయెత్తగా

[యోగి ఆనందం బ్రహ్మమూర్తి దగ్గరకూర్చొని యుండును]

బ్రహ్మ (పొరలాడుచు) నారాయణ, నారాయణ, దాహము, దాహము

యోగి ఆనందం నీవువెళ్ళి యెచ్చటనైన మంచితీర్థము గొనితెమ్ము నాయనా.

(ఆనందము లోపలికివెళ్ళి నీరుతెచ్చి బ్రహ్మగారికి త్రాపును)

ఆనందం తాతయ్యా, అమ్మ యింకను రాలేదేం

యోగి నాయనా. ఇది కష్టకాలము ఏ కార్యము తొందరగా లభించదు.

చ॥ కలిగిన కష్టకాలమున కార్యమనొక్కటి చేయఁబూనినన్
వెలయు మరొక్కటై దలచువేళకు గాదది యెట్లువేగినన్
బలుకరు బాంధవుల్ మిగులబాధలు గల్గిన యట్టివేళలన్
బిలువ ధనంబు గోరునని బిట్టుగ జూతురు కార్యశూన్యులై.

ఈకాలమున ధనములేకున్న కార్యసాధన మబ్బుట దుర్లభము

ఆనందం అమ్మ దుఃఖముచే మార్గము తప్పెనేమొ. తాతయ్యా, అంతవరకు వెళ్లి చూచి వచ్చెదనా?

యోగి అగత్యము పోయిరమ్ము (ఆనందం నమస్కరించి వెళ్లును)

[సబ్‌యిన్స్పెక్టరు యిరువురు పోలీసులతో ప్రవేశము]

యిన్స్ ఏయ్, సన్యాసి ఏవూరుమీాది, ఏమయ్యాడామన్ని

యోగి విషబాధచే లేవలేకున్నాడండీ?

యిన్స్ విషమా? పెట్టినవారెవరు?

యోగి ఎవరో ధనకాంక్షగల లుబ్ధులు.

యిన్స్ ఏమీా? నీవేమోసకుడవు ఈవేషానికంటే ముందెన్ని కూనిల్ చేశావ్? చెప్పు రాస్కెల్.

[అని నోటుబుక్కు తీసుకొని వ్రాత. భినయించు]

యోగి నాపేరెందుకండీ? నేను మార్గమున బోవుచుండ ఇతనిభార్య బిడ్డ లేడ్చుచుండుటగాంచి పరోపకారధర్మముం బాటించుచుంటిని. ఇంతకు మించిన యపరాథమేమియు జేయలెదండీ.

యిన్ని ఈకార్యమునకు నీవేకారకుడవు ఫూల్ (అని పోలీసులకు సైగ చేయును)

పోలీస్ యేయ్ సన్యాసీ (అని బ్రక్కకుబిల్చి) ఈగొడువంతా యెందుకయ్యా? అనుకొన్నావి బ్రతికేవానివి నీవద్ద యెంత డబ్బుంది నీకేమీ భయంలేదు. సవరించేభారం మాది.

యోగి నాకన్నపానీయములు సైతములేవు. నిరంతర భగవన్నామమే యాహారము, నాచెంత ధన మెక్కడిది?

(పోలీసులు సోదాచూచి రుద్రాక్షలదండ నేలవైచి యిన్నిపెక్టరు చెవిలో రహస్యము చెప్పుదురు.)

యిన్ని ఊ! సరిసరి. యేమోయ్. సన్యాసీ జైలెవ్వడైన చూచితివా?

యోగి జగత్కల్యాణము గోరువారికి జైలన్న భయముండునా?

యిన్ని నీవుసన్యాసివి. ఇతనిపై విలువైన సొత్తులున్నాయ్. నేతీసుకవెళ్లి ప్రభుత్వమున కొప్పజెప్పుతాను. వీరిభార్య బిడ్డలు వచ్చినతోడనే ఇచ్చివేస్తాను. (అనిచీటివ్రాసి నేలపడవైచి బ్రహ్మమూర్తిపై నున్న సొత్తులన్నియు మూట గటుకొని వెళ్లిపోవుదురు)

(తెరవ్రాలును)

—: జంబుకేశ్వరుని ఇంటివీథి. :—

ఆనందం (ప్రవేశము) అమ్మా! అమ్మా? ఎక్కడ వెదకినను గాన్పింపదే?

కార్క ఇస్. నోరుమూయ్? ఎవరిల్లనుకున్నావ్?

మార్కు ప్రధానమంత్రి జంబుకేశ్వరుని ఇల్లు తెలీదూ?

ఆనందం మాఅమ్మకొరకు వెదకుచున్నానండి, కనబడ్డంలేదు.

మార్కు అమ్మ? అమ్మ యెక్కాండి సో?

ఆనందం దాసికి మార్గ మెల్లు నాయునా?

కార్క- ముక్కుకు సూటిగా చూచి చక్కగావెళ్లు. అల్లరిచేయకు. ఊ!
ఆనందం (పరుగెత్తిపోవును)

(భటులు నిష్క్రమింతురు)

( తెరయెత్తగా యోగి బ్రహ్మమూర్తియెద్ద కూర్చొనియుండురు )

యోగి [తనలో] ఇరువురిలో నొక్కరైనను రాకుంటిరి వారి కేదియో ఆపద సంభవించి యుండవచ్చును (దృష్టినిభివయించి) ఆ ఇక ఈభారమంతయు నాపైబడియె [శివమునుద్దేశించి] వేదాంత వేద్యా!

ఉ॥ ఏమనుకర్మభాగ్య ముదయించి జనించెను బ్రహ్మమూర్తి నా
కేమి తపః ప్రభావమున కిప్పుడిహి మానవసేవలబ్బె నో
స్వామి పరోపకార ఫలసాధన మానవసేవ యందువా
నేమముదీర్చి పంతమును నెగ్గగజేయుదవా మనోహరా

(ఇంతలో దరిద్రవేషములతో శాస్త్రి శెట్టి. రెడ్డి. సాహెబ్)
[ప్రవేశము]

యోగి (ఎదురేగి) అయ్యలారా? మీరెచ్చటికి బోవుచుంటిరి. ఈ యనాధకు స్వల్పసహాయము చేయుడు.

శాస్త్రి ఛీ! అపశకునం సన్యాసి దర్శనం, పైగా పల్కరించటం.

శెట్టి (యోగివంక బిఱ్ఱుగజూచి) సన్నాసి ముండాకొడుకులు సత్రాల్లో సావక దొంగదువల్లాగ దోవల్లో చస్తారెందుకూంటా? కోపమూ తెలకడగటం తప్పంటూకా?

రెడ్డి పగులు దోవల్కొట్టడం, రేయి దొంగతనం తెల్సిందే.

సాహెబ్ అరే బేఖూబ్? ఛల్కె లేదూ? నూనచ్చిందికాక ముర్దాక్ ఫీస్లెకి ముందేశికున్నావ్. (పక్కకుచూచి, మైనయాలబై ముర్దార్ ఫీస్లెముందు తల్గింది మేమ్ కామ్ఖై.

శెట్టి (స్వాగతం) (పెడమొగం పెట్టుకొని మొలతాడు చమరుచు) పెట్టెతాళం వేశినానా లేదాంట!

శాస్త్రి ఆ! అనిగో దొరికిందీదారి?

శెట్టి అచ్చే లేదండీ? మీ కందరికెంతో నాకంతే (శాస్త్రిదగ్గరకు పోయి) పంతులూనూ సెప్పినట్లు పొయ్యేవాళ్లమే. కాదంటారా కోప్పడాకండి అందుకే అన్ని మీరుసవరిచ్చుకొచ్చే బాగుంటుందేమోనంట (అని నవ్వెను.)

శాస్త్రి ఇదేమిటయ్యా? పెద్ద పాపు శాదివినీవు. పెద్దరైతుపెరుమాళ్ గర్హి మహమ్మదీయులలోకి పెద్దమటిషిసాహెబ్, వుండగా పంచాంగమయ్యెను నన్ను పొమ్మంటారేం, మీరెల్లండి. ఇదే నాకు పెద్దబహుమానం. ఏం బాలక్రిష్టమ్మ యేమంటాపు?

రెడ్డి ఏమంటారు. అటుల్లోకినుంచు బాలకృష్టమ్మంటాపు శెట్టిగారే ముందు.

శెట్టి ఇదుగి దెంతెంచుకూంట, కోప్పడాకండి. బతుకుతే అందరం. చచ్చే అంతే? లేదంటారా, శాస్త్రి.

యోగి ఆర్యులారా! నన్నేమనినను సరియే, ఈదీనుని వైద్యునింట జేర్చుటకు సహాయపడుడు. (శాస్త్రిదగ్గరకువెళ్లి) ఏమండీ. ఇది ధర్మవిరుద్ధమా.

శాస్త్రి ధర్మవిరుద్ధంగాదు. ఖర్మబలవంతం తప్పదు, పోనీ, ఇంతకు పాణముందా (అని నస్యము పీల్చును)

యోగి అయ్యో, సజీవుడండీ?

శెట్టి చావలేదంటారుకదూ సరెసరే. అదే కావల్సిందీంట.

శాస్త్రి ఆ. పెరుమాళ రెడ్డి పట్టు. ఏంపరువాలేదు.

రెడ్డి పదండి పాపం పట్టుకెళ్దాం

శెట్టి పంతులూ, మాట నా కోపలుగక్కుణి నేను పట్టాల్సిందేనంటారా. తెలకదుగుత దాన్గ్గాను అచ్చే నీలాటి పెద్దలు నన్నేమంటారోని అంతేనూంట (అని నవ్వెను)

శాస్త్రి ఏమంటారు ని మొహంనుంటాను. పెద్దవాళ్లే పట్టడానికి నేనే సిద్ధమైతే, ఎవరో అంటారని ఏముస్తా చెందుకు పట్టూ.

సాహెబ్ అరె భతిఖానోడైతె, భట్టాల్సిందేస్తె.

(అందరు బ్రహ్మమూర్తిని యెత్తుకొని వెళ్లుదురు)
(తెరవ్రాలును)

—* డాక్టరు ఇంటిముందర యోగిప్రవేశము. *—

యోగి డాక్టరుగారూ! డాక్టరుగారూ!
జవాన్ ఏయ్ ముసాఫర్ గింజల్ యిస్సాకేం ఇక్డ. డాక్టరుఖానా తెల్సిందె లేదూనీకి.
యోగి డాక్టరుగారితో, తొందరగా మాట్లాడే పనివుందిబాబూ.
జవాన్ (దగ్గరకువెళ్లి) పైసాక్యాతెబిహై. తెచ్చినా.
యోగి నాకు డబ్బెక్కడిది బాబూ.
జవాన్ డబ్బులేదూ? జావుగావోయ్. జావుగు మీాదినాయున ఘర్ హైక్యా వాః?
యోగి ఎంత ధన పిశాచమావహించినది (గట్టిగా) డాక్టరుగారు డాక్టరుగారూ
జవాన్ (చేతనోరు మూసుకొని) అరె అల్లాకొరే [గట్టిగ] నీకి యారు పంపలేదోయ్ (అని ప్రక్కకు జరుగును)

—♦♦♦ రెండవ తెరయెత్తగా ♦♦♦—

(డాక్టరు శూలపాణి. ఇతనిభార్య సుగంధలత ఇంటిలో కుర్చీలపై కూర్చొని యుండగా తెరయెత్తబడును)
సుగం ఏమండీ? ఈసంసారం గొడువయేంటో నాకుబోధ పడడంలేదు?
డాక్టరు అబ్బే నీకేకాదు. ఈకాలపు ఆడవాళ్లల్లో సంసార. బోధపడేవాళ్లే అరుదు.
సుగం అదిగో. మొదటినుండి మొగవారికి పుట్టిన వుండేయిది ఎప్పుడు ఆడవాళ్లను ఆటవస్తువుల్లా ఆశించటం అధికారాలు చలాయించటం. ఏమాట జెప్పిన ఎగతాళి చేయుటం.
డాక్టరు ఇప్పుడవి అమల్లో లేక పురుషులకంటే యెక్కువస్వాతంత్ర్యం స్త్రీలదే, పోనీ నీస్వాతంత్ర్యమునకు నేనేమిాభంగం కలిగించటంలేదే

సుగం ఆ అవునవును కమ్మని మాటలతో క్రిక్కు చక్కబెడుతారు. ఆమోసాలకే ఆడవాళ్లునమ్మి అన్యోగతి పాలైనది

డాక్టరు మగవాండ్ల కిటుకులన్ని గ్రహించినందులకే కదా నీకీ స్వాతంత్రము లభించినది.

సుగం అవును నా స్వాతంత్రము నేను? నాసుఖం యేంచేయ్యాలి కాసుడబ్బైనా చేత లేదు.

డాక్టరు కాసుడబ్బు ఏలావుంటుంది. కొందెద్దులుజోడు. చేనుబీడు అన్నారు. అనుభవంగల పెద్దలు.

యోగి [ప్రవేశము] ఆ. నిజము. నిజము.

సీ॥ నిదుర లేచినంతోడ నిలుపుటద్దము నూని
వ్యాసలైను స్నో సెంటువాటరొకటి
వెనువెంట దువ్వెనల్ వేడిధర్మాస్లాస్కు
బెడ్ కాఫి సిగరెట్లు భేదిసాల్టు
పండ్లు శుభ్రతజేయు పౌడర్లు బ్రిష్షులు
సేవింగు నైఫులు సిజరుగిన్నె
మిషను సబ్బులు తుండ్లు మేలురకంబైన
పడక కుర్చీలతో పటపుటిండ్లు
రిబ్బండ్లు బిస్కెట్లు రింగులు బిటలు
హ్యాండ్బ్యాగులు బూట్సు లీ హ్యాటుసూటు
కండ్లద్దములు కోట్లు కరమందు హ్యాండ్కర్
చీఫ్ ఇల్లుకుర్చీ లీవరులతోనిండి
తే॥ గీ॥ యుండవలె వస్తువిందొక్క టుండకున్న
నిత్యకృత్యములకు చేయువిజము నేడు
ఖర్మజాలక నొకరికాస జనిన
కాసుబుట్టదు ముప్పత్తిరువు షోను.

డాక్టరు ఎవరండీమీరు? ఎక్కడొచ్చారు?

సుగం ఓ! హలో గాంజాయికి డబ్బులేదేం?

యోగి కాదండీ మీరు త్వరగా లేచి రావలయును. విష బాధితుడగు రోగిని తెచ్చినాను.

సుగం ఏమైన డబ్బుగలవాడా! లేక నీబోటి దరిద్ర దామోదరుడా?

యోగి ఒకప్పుడు ధనికుడేగాని, ఇప్పుడు నాకన్న దరిద్రదశలో నున్నాడు.

సుగం ముఃయ్‌నోక్. ఫ్యూక్. ఫ్యూక్.

జవాన్ [ప్రవేశించి సల్లాము చేయును]

సుగం వీణ్ణి లోపలికెందు కొదిలావ్.

జవాన్ (భయమునభినయించి) మై బోల్యాసై క్యారే ఇసె గిఃజలీ ఖానా క్యారే. హాందర్ వచ్చినా. (సుగంధంనుచూచి) నై మా మేమ్ పుచ్చల్ రేసప్పావుంటే నచ్చినాదుమా

యోగి ఏమయ్యా. ఈయన్యాయము. దిక్కులేనివాని బాధదీర్పరు.

డాక్టరు నీవున్నాడవుకదా దిక్కు. మరేం బ్రతికి బాగున్న రేపుదయం పదిగంటలకు ఆస్పత్రికి తీసుకరా.

యోగి ఉదయంవరకు తాళలేడండీ. ఎక్కువ ప్రమాదంగాయున్నది.

సుగం భస్త్! పీడవదలిపోతుంది. డబ్బులేనివాడు, బ్రతికిన కష్టపడాలి కదూ వాడికదే సుఖం

యోగి డబ్బుకొరకై దరిద్రులను అకాల మృత్యువునకు బలియివ్వ వలశినదేనా?

డాక్టరు ఏయ్? గెటవుట్ స్టుపిడ్ రాస్కెల్ దొబ్బావల

జవాన్ అరే మై బోల్యాసై క్యా బేఖూబ్. నాకు తిట్లు యిప్పిస్తావ్ (అని త్రోయుటకు చేయిచాచి దడాలున జవాన్ నేలబడి లేచి కేకలువేయుచు సుగంధం కర్చీవైపుగా సోలుచూపోవును.

డాక్టరు వోరీ రాస్కెల్, ఏమాభయం.

జవాన్ ఈ ఖొల్వు మాకీ నఖోభై. మేమ్ ఫకీర్ పనిచేసి బతుకుతాం అరె కిత్తామోటా సైతాన్ హుజూర్ బడేసైతాన్ నామిద్కి తగిలింది. నీకిసలాం నీ ఖొల్వుకిసలాం (అని వెళ్లిపోవును)

సుగం (లేచి గట్టిగా) నీవేదయ్యాం, నీకన్న మరోదయ్యముందా?
యోగి ఏమండీ? ఈయన్యాయము. బీదల సౌఖ్యమునకు గదా ప్రభుత్వము మీకుడబ్బిచ్చునది.
సుగం అధిక ప్రసంగం నీకెందుకూ పాలీస్టేషన్ దర్శనం కావాలా?
యోగి అట్టి న్యాయపరిపాలకులుండిన మీయాటలిట్లు సాగునా? ఔరా! ఎంతటి ధనకాంక్ష మీరునిజమైన భారతీయులా?

శా॥ నీవీ భారత భూమిబుట్టితివిగానీ పూర్వపుణ్యంబె గా
కేవీభూత దయాది సద్గుణము లింకేరీతి శోధించినన్
భావంబెల్ల దురాశ చేగలుషతం బ్రాపించె పొమ్మందు వా
రావా బీదల బాధదీర్పవుర నిర్భాగ్యాన్య భావాత్ముడా

డాక్టరు ఏయ్ కూయక వెళ్లు
యోగి నావి కూతలయ్యా? ఓరీ లుబ్ధపిశాచమా!

ఉ॥ ఎందరి జంపినావొ ఇటులేడ్చుచు నీదరిజేరు బీదలన్
ఎందరమిత్రింగ బూనితివొ ఎందరుపొట్టకు తృప్తి జెందు నీ
డెందము భారతీయులని కొందరిగోరెనొ ద్రవ్యహీనులై
ముందరజేరః బిచ్చుకల మోదముతో దిగమ్రింగుగూబవై.

(శివము పరికించి) రమామనోహరా!

సీ॥ హైందవభాష యేకుందులో గలసెనో
వేదశాస్త్రము లెందువిడచిచనెనో
ఆదిసంస్కృతి విద్యలణగి యెందుండెనో
ఆంధ్రానుశాసన మరిగెనెట్లు
యుగసృష్టిమూల మాయుర్వేద మెటునుండె
అస్త్ర శస్త్రాదులేయడవి జేరె
సత్యధర్మంబు లేచాటునఁ దాగెనో
సుగుణంబు లెవ్వరి చూడజనెనో.

గీ॥ అన్ని మాయముగా దోచి ఆంగ్లమనెడు
సర్వసంకర విద్యకే స్థానమయ్యె
అన్యమతములు మన దేశ మావరించి
దాసులైయుండి రిద్దె పేరాసమహిమ.

(అని వెళ్లును)

[యోగి బ్రహ్మమూర్తియొద్ద కూర్చొని యుండగా తెరయెత్తబడును]

యోగి నాయనా బ్రహ్మమూర్తీ!

ఉ॥ భారతభూమి బుట్టి యలభారతవీరుని బేరుబెట్టి సం
సారము గూర్చునట్టి సతిసాధ్విని బ్రేమను జేయివట్టి నే
భారము దోపనట్టి సుఖభారము మోసెడుజెట్టి ఏ
నేరము జేయునట్టి నిను నెట్టిన లుబ్ధుడు బారముట్టునే.

ఔరా కాలమహిమ

(శెట్టి, శాస్త్రి, రెడ్డి, సాహెబ్. వరుసగా ఒకరివెంట నొకరు నెత్తులపై సంతమూటల నిడుకొని తొందరతో ప్రవేశింతురు.)

యోగి [ఎదురేగి] భారతీయులారా నిరుపేదకు ప్రాణదానమొసంగుడు

శెట్టి (భయముతో వెనుకడుగువేయగా తలలమీది మూటలు ఒకొటొకటి థీకొని నేలబడును.

శాస్త్రి (కోపముతో ముందునకు వచ్చి, ఛీ అవలక్షణపుకొయ్యా! నీ కేపెనుభూతం తాకిందిరా. ఛీ. ఛీ. ఛీ. (వెనుదిరిగి యోగినిచూచి) ఓహో మళ్లీ ప్రత్యక్షమైనారూ?

యోగి ప్రపంచ క్షేమమునకై ప్రత్యక్షమైతిని. ప్రయోజన శూన్యునిగా పరిగణించకుడు.

శాస్త్రి ప్రయోజనమో! అప్రయోజనమో ఖర్మంజాలక కలిగేవన్నీ కడ తేర్చుకోవలసిందే.

శెట్టి [యోగి నెగాదిగజూచి] ఆ. నువ్వా దండాలండీ దండాలు సమయానికి సరిగ్గా సర్కసరిచేశావ్. తిరిగ బాడుగ తప్ప లేదన్నమాటే. అపచకునం అంటే వూరక పోతుందామల్లి,

రెడ్డి అప్పుడే ఏమయ్యింది, యింగా ఎన్ని గాశారాలుండాయో ముందు.
శాస్త్రి అబ్బ వుండండయ్యా. యింతకు లబ్దమేమిటో తేల్చుకుందాం ఏమండీ ఇంగ్లీషు డాక్టరిచ్చిన సలహా ఏం తేలింది.
యోగి ధనములేని దరిద్రులను తన్నుకొని చావమన్నది.
శాస్త్రి ఆ. అయిందీ నీకు మంగళహారతి. ఆ. నీకేమిటయ్యా, నిలువనీడలేని నిరుపేదలను నిలువున ప్రాణాలను తీస్తుందీ ప్రభుత్వము. సరే, పెరిగినంత విరుగుటకే పోనీ నీవు మాత్రం మంచిపని చేశావు. అవును సన్యాసం తీసుకోవడమే చక్కని ఉపాయం. ఈదౌర్జన్యాలు ఈఅన్యాయాలు ఈపన్నుల బాధల్లో ప్రత్యక్షయమలోకంలోనుండి బయటపడ్డావు సంతోషం.
యోగి ఈయమలోకం అంతరించి స్వర్గసీమగా బోవుచున్నది సంఘైక్యత నెలకొల్పి సహాయ మొసంగుడు.
శెట్టి ఈ ప్రభుత్వాన్ని ఈశ్వరిచ్చె వ్యాపారానికేం దెబ్బ లేదంటారుకదూ. కోపడాకరి.
శాస్త్రి ఏప్రభుత్వమైనా వ్యాపారానికేం భయం. ఇక మాగతేమిటయ్యా, అవస్థపడి ఆమశ్రాద్ధాలు చేయించి అమంగళ దానాలు తీసుకొని అన్ని అబ్బాయి చదువుకే ధారపోస్తే తీరా యేచిన్న ఉద్యోగములోనో చేరేసమయంలోనో చేరే సమయములో ఈయుద్యమం బయల్దేరి ఆశాస్త్రబంధం వేయ సిద్ధమైనారు. సరే పూర్వజన్మ సంస్కారం ఏంచేస్తాం కానీ
యోగి ఈకుతంత్రోద్యోగ వ్యాపారములేమిమ్ము బంధించినదాస్య శృంఖలములు ఏమందువా?
శా॥ వ్యాపారంబౌక మోహపాశమిటులే వ్యాపించె నుద్యోగముల్ జూపించుచు చెడుదారి శృంఖలములై జుట్టంగట్టె బాధల్ని దాపంచెంచి భ్రమింపజేయు మిమ్ముదాస్యంబువన్ పోరు నానా రూపం బారసి మోసపోకుడిక అరూపించుమార్గుల్ సుమీ.
ఇంతనైనను దాశ్యాంధకారము వదలి పెట్టుడు.

**శెట్టి** — శిత్రం. శిత్రం. శిత్రం. నిండనూరేళ్లెల్ల బతుకూంట. మీరన్నట్టు గుగ్గుల్లు దొరుకుతాయనే యాశతో, గుఱ్ఱం బండీడ్సేది తప్పక కోపమొచ్చినపుడల్లా కొరడాదెబ్బల్ తప్ప వన్నట్టుంది మాబతుకూంట. నిజం నిజం అంతేడబ్బాళకు పోతే దెబ్బల్కూడా తప్పవూంట.

**శాస్త్రి** — పోసీవయ్యా ఈవ్యామోహాలన్ని వదిలేతాం. సరే నీసీ మాటలు చూస్తూవుండు ఆయుర్వేద ఆస్పత్రిలో ఈయనను వదలిస్తాం. ఊ కదలండి

రెడ్డి. శాస్త్రి. సాహెబ్. యోగి. బ్రిహ్మమూర్తిని యెత్తుకొని పోదురు. శెట్టి మాటలవద్ద కూర్చొనియుండును.

తెరవ్రాలును.

శ్రీద్వితీయాంకము సమాప్తము.

# తృతీయాంకము.



[లబ్ధరాజు మంత్రులతోసహా కూర్చొని యుండగా తెరయెత్తబడును

**జంబు** — లబ్ధరాజా? పరిపాలన విధానము చక్కబరచవలయును. ప్రజలు చెలరేగి ప్రభుత్వమునకే యపాయము సంభవించుటకై కొన్ని ముఖ్యసూత్రములాలోచించితి?

**లబ్ధరాజు** — నీయాలోచన కెన్నడైన వ్యతిరేకము జెప్పితినా అగత్యము వెల్లడించుడు.

**జంబు** — (లేచి) ధనములేకున్న మనమేకార్యము సాధించలేము నుడివెదవినుడు,

సీ॥ ధనము సంపాదించి తగుసైన్యము న్పెంచి
నవని పైరాజుల వణచివైచి
సమయోచితంబగు సాధనంబులగూర్చి
సాధింప యోచనల్ సలుపవలయు
ఇండ్లు వాకిలులన్ని ఎన్నియాలంజేసి
బ్రహ్మమూర్తిని బొమ్మవగిదిజేసి
ప్రజలు సంఘమటన్న బడమోది సిక్షించి
మరణశాసనము చేమట్టుబెట్టి
గీ॥ సిస్తులెచ్చించి ధనమెట్లో చేర్చుకొనుచు
విద్యనేర్చిన నౌకరివెలయ నిచ్చి
ఆశకల్పించి కొందర నాదరించి
ద్రవ్యమార్జింప రాజ్యమ్ము దక్కుమనకు.

వంది అవును ఇట్టిక్రూర శాసనములచే ప్రజలకు మరింత కష్టములు కల్పించుటేగదా. మీయభిప్రాయము?

జంబు సరియే? కష్టించినవారికే ఫలం. ఇది రాజ్యతంత్రము బయల్పరుపరాదు.

వంది ఔను బ్రహ్మమూర్తి మనకే యుపకారమునూ చేయలేదే అతని శాకష్టము లేలకల్పింప వలయును.

జంబు ఇట్టివిషయములు యోచించి యోచించి నిశ్చయపరచితి, ఇందలి నీయోచనలేమియు బనిలేదు.

వంది యోచనలే బనికిరాకున్న మేమెట్టు మంత్రులమయ్యెదము యోచనలేని మంత్రులు వాసనలేని పువ్వులు రెండుసమాన ములేకదా?

జంబు వందీ? బాగుగ నాలోచించి మాట్లాడుము జాగ్రత?

వంది [తనలో] ఇక మితిమీరిన నాకును సుధర్మ బ్రహ్మ మూర్తులకు పటినగతియే. ఎందుకొచ్చినదాచిక్కు? ఈ రాజ్య మేయేటబడిననేమి? అప్రజలేనీట మునిగిననేమి? వ ద వి

పోగొట్టుకొని పరితపించుటకన్న ధనముసంపాదించి దర్జాగా బ్రతుకవచ్చునుగదా (వగ్రికాశంగా) జంబుకేశ్వరా నీవు ఏమందువోయని యిట్లంటివి. వేరుగా దలపకుడు.

[అందరు సంతోషముచేయుదురు తెరవ్రాలును]

* పిచ్చి ఆస్పత్రి. *

(డాక్టరు డాక్టరుభార్య కూర్చొనియుండగా తెరయెత్తబడును.)

[కార్కు-మార్కు భారతీదేవిని ఈడ్చుకొని ప్రవేశించి నేల పడవైతురు] (చీటిని యిత్తురు)

సుగం (జాబు చదువుకొని) ఈపీనుగునిందేల దెచ్చితిరి? పెరట్లో షారవేళి పైన మట్టిగప్పక జాబులో బ్రతికిన మనిషియనివుంటే మీరుచంపి తెచ్చారేం.

కార్కు-మార్కు [చేతులు పిసికికొనుచు) లేదుసార్ ఆడనే మబ్బుగప్పింది?

సుగం ఆవిధంగా మీరు స్టేటుమెంటు ఇవ్వండి,

కార్కు భయముతో) పదిరూపాయల గాసానికి పడివున్నాం, పిల్లలు గల్లోల్లం కడ్పుమీద కొట్టాకుతల్లి

సుగం రాసెల్ మిమ్ము జైలుకు పంపుతాను. చెప్పుమీపేర్లు?

డాక్టరు (భటులనుజూచి) జైలెందుకురా, నిన్న 1-వ తేది మీజీతాలు వచ్చాయికదూ. ఊ. అంతభాగ్యానికి పాపం! పొరబాటు పనిచేశారు.

మార్కు మేమ్ చేయలేదబ్బా? మాజీతంలో సగంతీసుకొని మమ్మల్ని వదలండి.

సుగం ఈలాంటివి మీరు ఎన్నో సంపాదించటంలేదూ?

కార్కు (చిన్నగా) ఇది మనగాంచారం యీ [అని పదిరూపాయలునిత్తురు]

డాక్టరు ఇక మీరు వెళ్లవచ్చును. (కార్కు మార్కు వెళ్లుదురు)

సుగం (భారతీదేవి సొత్తులు ఒక్కొక్కటి తీసికొనుచుందును)
డాక్టరు వుశ్ త్వరగా? ఇందేమీ లేవుకదూ?
సుగం యేమీ లేవుగాని చిన్నబంగారు గిన్నెలావుంది.
డాక్టరు హిందూ ఆచారము మంగళసూత్ర మంటారులే. వుండనీ పాపం
సుగం హిందూ ఆచారము ఈపాడు ఆచారమే స్త్రీలకు స్వాతంత్రము లెకుండా చేసినది [అని మంగళసూత్రము లాగును]
భారతి (దిగ్గునలేచి భ్రమతో) ఆ. ఆ నా మంగళ సూత్రమంటుదవా పిశాచమా! పిశాచమా? దయ్యమా? కాదు భూతమా? నాపతి నాఆనందం ఏదీ (అని సుగంధంనుచూచి) నీ వెవరుతల్లీ? నీ వెవ్వరు?
సుగం ఓ వహో! దీనికి నిజముగా పిచ్చెత్తినదే?
భారతి (ఆలోచించి) నాకు పిచ్చిలెదు, నాదరిద్రము నన్నిట్లు చేయుచున్నది. పిచ్చిలేదు? పిచ్చిలేదు? లేదు?
సుగం ఉండూ (అని పరీక్షించును)
డాక్టరు సుగంధం ఏమీలేదు మనకెందుకీగొడువ (భారతీ దేవినిచూచి) అమ్మా బాగుగావుందికదూ వెళ్లుతావా?
భారతి వెళ్లెద తండ్రీ! నన్నువిడిచిన అంతియేచాలును. మీకు పదివేల నమస్కారములు.
సుగం ఏయ్, అరవకు. నిన్నెవరైన అడిగితే డాక్టరుగారు బాగు చేసినారని చెబుతావా?
భారతి అలాగే చెబుతాను తల్లీ,
సుగం వెళ్లు ఊ. ఊ. త్వరగా

[భారతి నిష్క్రమణ]

జవాను (తొందరగా ప్రవేశించి జాబు డాక్టరుకు ఇచ్చును)
డాక్టరు సుగంధం ఆనాడు మనఇంట్లో డిన్నరులో చూచావుగదూ ఆ పెద్ద ఆఫీసరు తాంబూలము వేసుకోవడంలో తటాలున, వక్కముక్క పండ్లమధ్య ప్రవేశించిందట. అర్జంటుగా వెళ్లవలసిందే?

సుగం వెళ్లవలసిందే? మన భోజనానికి చూచుకుంటే వుద్యోగానికే ప్రమాదంకదూ, వెళ్లండి? జట్కాబండి తీసుకరండి.

(అని చేతిసంచులతో డాక్టరు సుగంధం, జవాను వెళ్లుదురు.)

(ప్రవేశము) (భారతీదేవి వచ్చుమార్గమున కాక్కా మార్కులు యెదురేగి అడ్డుగా చేతులు జాచి)

కాక్కా యాడకెల్తావ్? ఆగూ, నీకోరకై మాబిడ్డలను వస్తుందనంటావ్ తిరుగు?

భారతి [భయముతో] నేనేమి జేసితిని నాయనా, మీబిడ్డలలో నేనొకబిడ్డను అనాధను దయయుంచుడు.

మార్కు దుష్ట పోగొట్టుకున్నవ్వాడు దయలేం వనికొస్తాయ్? నువడుంటే మేం చంపి తెచ్చామని బెదరించి పదివూపాయల వదలించారు. తెల్సా?

భారతి తెలిసి నేనేమి చేయుదును. తండ్రీ?

కాక్కా ఏంచేసేది ఈడకాదు. కాంతమ్మగారి ఇంటికీడ్చివెళ్లితే కల్లార చూస్తావ్ ఊఁ. కదలూ

భారతి ఆయ్యో? భారతమాత (అభరణముల చముకొని) అభరణములు సైతము అదృశ్యములయ్యేనే? తల్లీ గౌరీమాతా! (అని హృదయము చముకొనుచు) అన్నలారా? నన్ను ఆమహామారికి అప్పగించెదరా? నన్నొక బిడ్డగా నెంచుడి (ఆశ్చర్యముతో మంగళసూత్రమును చేతబట్టుకొని) ఆ. అన్నలారా ఒక్క పసుపుకొమ్ము తెచ్చి ఇచ్చిన మీయనప్పద్రవ్యమునొసంగెద (కాక్కాలోపలకు వెళ్లి ఒక్కపసుపుకొమ్ము తెచ్చియిచ్చును)

భారతి (పసుపు కొమ్మును మెడగట్టుకొని మంగళసూత్రమును తెంచి కన్నుల కొత్తుకొని) తల్లీ! గౌరీమాతా?

సీ॥ పెండ్లియాడిన నాటి ప్రేమానుబంధమా
    యురమె సుస్థిరమంచు నుండితమ్మ
ఉండినాపతి దప్ప యొరులెరుంగని నీవు
    వనయంబు నాసేవనందితమ్మ
సేవలందెడు నిన్ను చెనటినై విధిలేక
    విపదల దీర్పనే విడుతునమ్మ
విడిచిన నాపైని విశ్వాసముం విడక
    నీకళల్ నాందాఁగు నిల్పుమమ్మ
గీ॥ నిలిపి బతిజేర్చు భారంబు నీదెనమ్మ
చేర్చి సేవకులకు అప్పుదీర్పుమమ్మ
తీర్చి కష్టములింక నోదార్చుమమ్మ
శీలవతినేని గారమ్మ చేరరమ్మ.

(అని కంఠ్లకొత్తుకొని ఇచ్చును)

కార్య- మార్య- (సంతోషముతో) అమ్మా! శలవు (అని వెళ్లుదురు)

భారతి (స్వగతము) హా నాధా! నీదర్శన భాగ్యము నాకులేదా? నానాథుడు నా ఆనందం! ప్రియా! నా మనోహరుడు! నాప్రేమలత? నాజీవనము! నాప్రణయదాత! నాప్రాణపతి! అయ్యో! అయ్యో! నాఆనందం! నాముద్దులమూట! నాకై యెంతపరితపించు చుంటివో కదా!

మ॥ పతికే బాధలుగల్గెనో కొడుకుపై భారంబునోనాడియా
యెతనీదంఢ్రిసి జూచుచుండుమని వేఁడెందేగెనో దీనుడై
గతినాకెవ్వరు నాయనాథున సుతున్సద్విప్పి వీక్షింపుడో
మతిచాంచల్యముజెంద నావిభుడు వేమారాషె లేకుండెనో.

హానాధా! నాధా! (అని మూర్ఛిల్లి, తిన్నగాలేచి)

ఓ భారతమాతా! నేనిజమైన భారత వనితనేని నీవు రత్నగర్భయను సార్థక నామమేగలదేని? భారతనారీ రత్నములు నీయందుదయించిరేని నేనిరంతర పతి సేవా దురంధరనేని నీఅనన్య దయారసము నాయందు నిల్పియేయుంత రాయములు అడ్డురానియ్యక నామనోవల్లభుని చెంత జేర్చిభారము నీపై నిడి ఇదే నే నేగుచున్నదానను.

(అని వెళ్లును)

అ ర ణ్య ము లో ఆ న ం ద ం ప్ర వే శ ం.

అనంద అమ్మా! అమ్మా.

సీ॥ అమ్మ ఇందొకచోట అగుపడ దెటుపోదు
ఆకలి దప్పి యాయాసమయ్యె
ఏదిక్కుదోచ దింకెప్పుడొచ్చునోతల్లి
మాటాడనాలుక మందమయ్యె
అడుగిడజాల నీయడవిలోబడియుండు
నావార్త దెలియదే నాటికైన
తల్లిదండ్రులకెంత తల్లడిల్లుచునన్ను
తలచి యేయేతీరువ మెలగువారొ
గీ॥ యెట్టులుంపితివయ్య జూపెట్టుమనగ
తాతసన్నాన కేదారి దరలినాడో
తీర ఋణమింక మిమ్ము నే చేరలేను
యందరికినొక్క దండమోయమ్మమీకు.

(అని చేతులు జోడించి మూర్ఛిల్లును)

[యోగి తొందరతో ప్రవేశించి ఆనందుని తొడల పైనిడుకొని ముఖముపై కమండలోదకములుచల్లి నోటిలో జలముపోయును]

ఆనందం! నందఆం.

ఆనందం (తిన్నగాలేచి) ఆయ్యా! అమ్మా! (యోగిని కవుగలించుకొను)
యోగి [వీపు చమురుచు] భయపడకుము, ఆనందం భయపడకుము.
ఆనం తాతయ్యా! తాతయ్యా! అమ్మను చూపు తాతయ్యా! అమ్మవ
యోగి నాయనా! తొందర నొందరపడకుము.
ఆనం లేదా? తాతయ్యా! అమ్మను జూడవలయును.

ఉ॥ అమ్మనుజూపుమయ్య కడునాకటి బాధకు నోర్వజాల మా
యమ్మ మరెచ్చటన్గలదొ యంచుల కేగుదమిప్పు తాతయా
కమ్మ నిబువ్వ బెట్టివనుగాంచిన తోడనయాలసించి నా
అమ్మను జూపకున్న నిక నాగవు ప్రాణములాదరింపవే.

(యోగిని కౌగలించుకొని దుఃఖించుచు)

యోగి ఛీ! భారతీయులు కాదు. నస్వదేశ వంచక జాతీయులు. సౌజన్య
దయాది సద్గుణములు మాతమూర్చిన నీచుల? నీ సదాన్యమున
ధనపిశాచ మావహించిన లుబ్ధులు? ఓరీ లబ్ధరాజా?

చ॥ అదయులు నీచమానసులు నాదరశూన్యుల ధర్మవర్తనుల్
పదవులయాసచే బిరికిపందలు గర్వులు దుర్మదాంధులై
వదలక లంచముల్ గొనెడివాడుక నేర్చెదు నీదు దాసులై
పొదపున నండనెంచితివొ పాడిమిపీడన వీరమేటినై.

ఓరీ జంబుకా, నీబానిసలనుకొన్న భారతీయులే నిన్ను
హతమార్చెదరు లెమ్మ, తిన్నగానడువుము. సాంద్రీ మా
తల్లియొద్ద జేర్చెద ఈదుష్టపరిపాలన ద్వంచిననేగాని దుంపగ
ములు చల్లారవు పోవుదమురమ్మ [అని వెళ్లును] తెర యెత్తగా,

(బ్రహ్మమూర్తి మంచముపై శయనించియుండ
కాళ్లకడ ఒక సేవకుడు నల్చుండి యుండును)

భారతి (తొందరగా ప్రవేశించి) హానాధా, నాధా, [అని మంచముపై
కూర్చుండును]

బ్రహ్మ (దిగ్గునలేచి) భారతీ! భారతీ! (అని నాలింగనము చేసుకొనును)

భారతి (పెటచెరుగుతో బ్రహ్మమూర్తి కన్నీరు తుడుచుచు) మీరు దుఃఖించిన మరింత ఆయాసమగును దుఃఖింపకుడు.

బ్రహ్మ (తెల్లబోయి! భారతీ! ఆనందంను చూడవలయును. నాయొద్దకు దోడ్కొనిరమ్ము. పొమ్ము

భారతి (మారాడక తలవాల్చుకొని కన్నీరు విడుచుచుండును)

బ్రహ్మ భారతీ, యేలదుఃఖించెదవు? ఆనందం నీ చెంతలేడా, ఎచ్చటికేగెను లేడందువా? అయ్యో? (కోపముతో) ఓరీ జంబుకా, కన్నులు దెరవని కసిగంగువుల సైతము నీరాజ్యకాంక్షయను మహామారికి బలియిచ్చితివా కన్నబిడ్డలు కోల్పోయిన తల్లిదండ్రుల కంటినీరే సముద్రమై సిన్నును నీ ప్రభుత్వమును హతమార్చకుండునా? ప్రజాద్రోహీ, (అని దుఃఖముతో) అయ్యో! అయ్యో. ఆనందం నాఆనందం హా! (అని మంచముపై బడును)

భారతి నాథా! నాథా! మీరే అధైర్యపడిన ఇక నాగతియేమి?

తే॥ గీ॥ ధర్మమూర్తులు ధీరులుదారపరులు
మీరె భయమందనాకిక దారియేది
జోడుదప్పిన బత్తుల జాడగాదె
ధైర్యమూనుడి యలసట దగదునాథా.

(యోగి ఆనందంతో ప్రవేశించును)

భారతి [యోగికి నమస్కరించును. వెనుక వైపునుండి ఆనందుడు తల్లియొద్దకు పరుగెత్తును]

ఆనం అమ్మా! అమ్మా! (అని కౌగిలించుకొనును)

బ్రహ్మ ఆనందం ఆనందం. (లేచి చేతులుజాచును)

ఆనం నాన్నా! నాన్నా! (తండ్రి నాలింగనము చేసుకొనును)

బ్రహ్మ తండ్రీ! నాఆనందం

యోగి అమ్మా! భారతీదేవీ అబ్బాయి ఆకలిచే పరితపించు చున్నాడు
భారతి (కొడుకు నెత్తుకొని) భుజింతువురమ్మా, తండ్రీ.
ఆనం ఆకలెక్కడిదమ్మా! మిమ్ము జూచినతోనే?
బ్రహ్మ కొద్దిగా భుజింపుము తండ్రీ! [భార్యనుజూచి] కొద్దిగా అన్నము బెట్టవే?
భారతి నా నవరత్నములమూట (అని ముద్దుపెట్టుకొని వెళ్లును)

తెరవాలును.

—* తెర యెత్తగా *—

(ఆయుర్వేద వైద్యశాల, భిషక్ గోపాలాచార్యులు)

యోగి, బ్రహ్మమూర్తి, భారతి, ఆనందం ప్రవేశింతురు.

గోపాలా, నమస్తే యోగిపుంగవా, కూర్చొనుడు.
(బ్రహ్మమూర్తి, భారతీ, ఆనందం గోపాలాచార్యునకు నమస్కరింతురు.)
గోపాలా ఓ హో! బ్రహ్మమూర్తీ, కూర్చొనుడు. ఈదినం ఔషధసేవ జేసితివా? కులాసాగావున్నదా?
బ్రహ్మ తమ ఆజ్ఞానుసారమే సేవించితి చాలా తేలికగా ఉన్నది.
గోపాలా మునీంద్రా, ఈ బాలునెక్కడ కనుగొంటిరి?
యోగి అరణ్యమున ఆపోవుచు నేలపడియుండెను.
గోపాలా అమ్మా? భారతీదేవీ, యీమునీశ్వరుడే నీకు పుత్రభిక్ష యొసంగెను.
భారతి తండ్రీ, గోపాలాచార్యులు పుత్రభిక్షయొసంగిన పరమేశ్వరుడు యోగి పతిభిక్షబెట్టిన పరమాత్మస్వరూపులు మీరు. వుభయులు మమ్ముద్ధరించిన జగదీశ్వరులేకదా. యెన్ని జన్మములెత్తిన మీఋణము తీర్పజాలము క్షమించుడు.
గోపాలా అన్నటికిని దైవమే కారకుడు. అనాథో దైవరక్షకః అన్నారుగా పెద్దలు.
బ్రహ్మ దైవం మానుషరూపేణ. మీరేకదా మాకు దైవము.

యోగి భిషగాచార్యా, యెంత సులభోపాయముగా, చికిత్స జేసితిరి. ఆయుర్వేద ప్రభావము మీశాస్త్రానుభవ నైపుణ్యము పరిశం సార్హమైనది.

గోపాలా, అంతయు మీఆశీర్వచన ప్రభావమే. గాని అన్యమతాచార విద్యల యందాసక్తిగల భారతీయులు కొందరీ వైద్యమునే దూషించు చుందురు. మునీంద్రా,

సీ॥ ఆది యాయుర్వేదమను కీర్తిగనుదాని
ఔషధంబుల నిష్ప్రయోజనముగ జేసెడు
మోటువైద్యంబు ఛీ. నాటుమందలటంచు
హేళన జేసెడి హిందువొకడు.
కుప్పెకట్లను చూడ చొప్పకట్టలు లేచు
కడునీచమను నాస్తికుండొకండు
కఠినపథ్యంబులా కాఫి బీడీలేదు
మాకేలయను సుకుమారి యొకడు.

గీ॥ ఔర ఆంగ్లేయ దాస్య వికారచేష్ట
కష్టముల దేలు ప్రాణులకన్న తల్లి
నార్యవైద్యము దూషింప నోడుగఅచు
పాలనమె మూలమనుమాట పాడిగాదె.

యోగి ప్రభుత్వ సహాయముండుట లేదా?

గోపాలా ఆనూతని మంతరించినది యీ బ్రిటీషు ప్రభుత్వమున అన్యాయపు ధనము నార్జించువారే అగ్రనాయకులు యిట్టి దుష్టపరిపాలన లంతరించు విద్యలు వృద్ధి జేందవు

[జవాన్ టాంటాం వేయును]

ఓ హో. యావన్మందికి తెలియజేయుడ మేమనగా యీ సంవత్సరం పన్ను నూపాయకు యెన్మిది అణాలవంతు జాస్తి చేయుడమైనది. అదిగాక ప్రతిమనిషి దినం ఒకటింటికి, ఒకఅణా చొప్పున తలపన్ను వేయుడమైనది. ఇందులో

గర్భిణీస్త్రీలు ఆరు నెలలు అయిన వెంటనే మిాస్వంత ఖర్చులతో విపులముగా ప్రభుత్వమునకు తెలియ జేయవలయును. అట్లు తెలుపనియెడల సంవత్సరంశిక్ష, 500 నూర్ల రూపాయల జుల్మానా వేయబడును. యిదిన్నిగాక రేపు ఉదయం పది గంటలకు బ్రహ్మమూర్తి యిల్లు యావదాస్తి కోటదగ్గర నవాలు వేయబడును కావలసినవారంతా వచ్చి సవాలు చేయవచ్చును. యింకా యేమనగా కొందరు ద్రోహులు దేశములో తప్పుడు బోధలు జేస్తారు. అవి యెవరేగాని, పిన కూడను శిక్షవిధించబడును. ఇది పెద్దమంత్రిగారి ఆజ్ఞ.

బ్రహ్మ [కోపముతో లేచి] ఆ ఓరీ! దేశద్రోహీ! జంబుకా అంతటితో తృప్తినొందక కూడుగుడ్డ నివాసములు సైతము కూలబోయ నెంచితివా?

సీ॥ అధికారమెల్ల నీయరచేతనిడుకొని
నను మోసమున జంపననిపినావు
బ్రతికె వీడని నీదుబగదీర్చుకొనబూని
యిల్లు యాలుం బేయ నెంచినావు
ప్రజలరక్తముబీల్చి పరగపిప్పులజేసి
దాసులై పడియుండ దలచినావు
పుడమిపన్నులు నీదు బొట్టనిండక గర్భ
శిశువుపై సిస్తు శాశించినావు
తే॥ ఔర నీనక్కజిత్తు లీయవని నెల్ల
నల్లుకొని యెల్లదేశముల్ తల్లడిల్లు
బాసినతనము విడనిన్ను బాతిపెట్టి
భారతావని సత్కీర్తి బడయువాడ.

నిన్ను హతమార్చి అనాథప్రజల ఆపదదీర్చెద? ఇదే వచ్చుచున్నాడ (కొందరతో పోబోవును)

యోగి బ్రహ్మమూర్తీ? శాంతింపుడు శాంతింపుడు (అని అడ్డగించి)
బ్రహ్మ అధర్మవర్తన ప్రభుత్వమున కణగి దాస్యమునజిక్కి తల్లడిల్లుట
కన్న విజయమో వీరస్వర్గమో సంపాదించెద
యోగి మంచిది. కాని, యెంతటి వీరధీరులైనను. సమయ
మారకార్యము సాధించవలసియు కాదందువా?

శా॥ పోనీకోపము తాళలేక రిపులన్ బోగాడ రన్ముంటివా
కానింమ్మాయుధమెద్ది నీకొకటిపైగా సైన్యమూలేదు. పో
రానీ చూచెదసన్న తోడ్పడప్రజల్ రాలేర విద్యాప్తి చే
నానీతిన్ విన నెంతువా విజయమెందున్ శాంతినూహింపుమా.

ఇది సమయముకాదు.

బ్రహ్మ తమయాజ్ఞ శిరసావహించితి (చేతులు జోడించును)
యోగి భిషగాచార్యా ధర్మప్రవర్తనులైన భారతీయుల నీఅధర్మాంధ
కారములో దోసిన ప్రభుత్వమోసము లివియేవినుడు.

సీ॥ ఉద్యోగమనునట్టి యురిదాళ్లు మెడజుట్టి
బడియుండుడని యల్పభరణమొసగె
వ్యాపారమను వెర్రివ్యాధికల్పన జేసి
బడుడని మంచాలపాలు జేసె
బిరుదులం పెనబుడ్డ బిడుదులనంటించి
నిర్వీర్యులం జేసి నిలిపె ప్రజల
లంచమిచ్చుచు దేశవంచకులుగమార్చి
దనపాచ బడియుండ దలచె నిట్లు
గీ॥ రత్నగర్భాసుపుత్ర ధీరత్నములను
రంగుమార్చును మిముగొంటు రాళ్లజేయు
మాయవలలోన బడబోక మరలుడింక
భరతసింహులార! యదేషజీవులార!

గాన మీ రెల్లరు శక్తి వంచనలేక దండనమారణ శిక్షలకు లొంగక పరిభోధకులుగండు నేనీదుష్టప్రభుత్వ మంతరించు వరకు ప్రచారకుడనయ్యెద.

గోపాలా మీయానతి మేరకు నేను మాదేశ సేవకుడనై ఈలబ్దరాజ్య మంతరించువరకు సేవచేసెద.

అందరు మంచిది.

(తెరవ్రాలును)

[యోగి పరిచారము సేయుచు ప్రవేశము]

యోగి ఓ భారతీయులారా, చూచితిరా లబ్ధరాజ్య ప్రభావము. భక్తిచేకూర్చు భగవదాలయములు సైతము నేడు విరక్తి పొడ సూపుచున్నవి దేవస్థానమని తెలిసికొనుటయే దుర్ఘటముగా నున్నది.

సీ॥ దేవాలయంబని దెలియుటె చోద్యంబు
గుట్టరీతిగ చెట్లు గుంపుజేరె
ద్వారమావల దాట ధైర్యమ్ము నూనదు
గబ్బిలమ్ములదంతు గవయుచుండు
నరగున పోబోవ సాగనివ్వదు బుద్ధి
వ్రేలాడు పైకప్పు వాలుజూచు
సాహసంబున స్వామిసన్నిధి కేగిన
కటికచీకటి బూచి గప్పియుండు

గీ॥ ఆశవిడలేక చేతితో అంటిచూడ
ధూళిచేనిండి తలమోము దోచకుండు
విగ్రహము జాడదెలియక విసుగుజెంది
భక్తిక్షీణించె జంబుక పాలనమున.

ప్రకృతి స్వరూపమై ప్రకాశించు భగవదాలయము లీగతిబట్టి మనకిక బాగుపడు మార్గమే పొడసూపదు. యీ జంబుక పాలనము నశించకున్న మన జీవనోపాదుల

నొనగూర్చు ప్రకృతిమాతయే వికృతిగామారును. త్యాగధనుడు అన్యోన్యమైత్రి గలిగినట్టి సంఘము నెలకొల్పును. భారత వీరగౌరవ ప్రతిష్ఠలునిల్పును. దుష్టశక్తులను పారమార్చునది ఒక్క అహింసాస్త్రమే. దానిచే దైవభక్తి గల్గి సత్యదీక్షా పరతంత్రులై సంఘైక్యత నెలకొల్పుడు. ఇదియే హైంధవ ధర్మము. భారతవీరత్వము.

(అని పాటపాడుచు వెళ్లును)

(లబ్ధరాజు ఆస్థానము మంత్రులతో సహా
కూర్చొని యుండగా [తెర యెత్తబడును]

స్త్రీలు ప్రవేశించి గంధర్వనాట్యము చేయుచుండ భటుడు ప్రవేశించి కాగితములకట్ట ప్రధానమంత్రి జంబుకేశ్వరునకిచ్చి వెళ్లిపోవును, (స్త్రీలు నిష్క్రమణ)

జంబు (ఒక్కొక్క కాగితము చదువనారంభించి లేచి) లబ్ధరాజా చూచితివా. బ్రహ్మమూర్తి దుర్మార్గములు. మన గూఢచార్యాధిపతులు అందజేసిన విజ్ఞాపనలు చదివెద వినుడు. తేట తెల్లముకాగలదు.

ప్రాగ్దేశ గూఢచార్యాధిపతి మన్వి
శ్రీ జంబుకేశ్వర ప్రభువుగారి దివ్యసన్నిధికి

ఈప్రదేశమున కొందరు రాజద్రోహులు ప్రవేశించి ప్రజలు విద్యావంతులు కావలయుననియు అనాధసిద్ధమైన విద్యలు నేర్చుకొనుటకు పాఠశాలలు కోరుడనియు ఇక అవి ఇవి అననేల యీరాజ్యమే రైతులదట. ఇట్టి దుర్బోధకులు సంఘమై ప్రచారములు చేయుచున్నారు వీరికి తగశిక్షా శాసనములు ప్రయోగించకున్న రాజ్యముతప్పక అరాజకమగును తెలిసేది.

ఇట్లు,
ప్రాగ్దేశ గూఢచర్యాధిపతి మన్వి.

[రెండవ కాగితమును తీసుకొని]
చూచితిరా, దుర్మార్గము వినుడు.

దక్షిణదేశ గూఢచర్యాధిపతి మన్వి.
శ్రీ జంబుకేశ్వర ప్రభువుగారికి:—
ప్రభూ రాజ్యమల్లకల్లోలము జేయుచు కొందరు దేశవంచకులు ప్రవేశించి అమాయకులైన రైతులకు రాజభక్తి నశింపజేయుచు పల్లెపల్లెలు తిరిగి పాఠశాలలు సౌకర్యము కొరకు వ్రాత్రి డిసేయుమని బోధించుచున్నారు. ప్రభుత్వమునకు భయపడవలదని అని యెన్నెన్నో ప్రచారములు జేయుచున్నారు. తెలిసెది.

ఇట్లు,
దక్షిణదేశ గూఢచర్యాధిపతి.

[మూడవ కాగితమును తీసికొని]

ఇట్టి దుర్మార్గులు ప్రబలిన రాజ్యాధిపత్యమిక దక్కునా చూడుడు.

పశ్చిమదేశ గూఢచర్యాధిపతి మన్వి.
ప్రధానమంత్రి పాదారవిందముల సన్నిధికి:—
ప్రభూ దేశమంతట విద్రోహులు చెలరేగి ప్రజావిప్లవము కలిగించుచున్నారు. తక్షణము మరణశాసనము ప్రయోగింపకున్న తప్పక రాజ్యతంత్రమునకు ప్రమాదము వాటిల్లును అర్జంటు.

ఇట్లు,
పశ్చిమదేశ గూఢచర్యాధిపతి.

(కోపముతో పండ్లుకొరుకుచు) దేశఘాతకులచర్యలు వినుచుంటిరా. కాలము సమీపించినది.

[తలయూపి నాల్గవ కాగితమును తీసికొని]

ఉత్తరదేశ గూఢచర్యాధిపతి మన్వి
శ్రీలబ్ధరాజ్యాధిపత్య జంబుకేశ్వర ప్రభువుగార్కి:-

విజ్ఞప్తి.

మీరు త్వరపడి కట్టుదిట్టములు చేయకున్న నేఁటి రేపో ప్రజలు చెలరేగి మా అధికారములనే లాగికొనుటకు ప్రయత్నములు జరుపుచున్నారు. త్రోవ త్రోవన ఇంటింటికి సంఘములై సమ్మెకట్టుచున్నారు. వీరికి కఠిన శాసనము లు తప్పక ఆమలుజరిపేది. ప్రమాదము జాగ్రత.

ఇట్లు,
ఉ త్త ర దే శ న్యా యా ధి ప తి.

(కోపముతో) ఈ దేశఘాతకుని యేమిచేసినను పాపముండదు. లబ్ధరాజా! నీ యభిప్రాయ మేమి?

లబ్ధరాజు సర్వజ్ఞుడవు. నీ యిష్టానుసార మే చేయవచ్చును.

జంబు ప్రతినిధులారా, మీ అభిప్రాయ మేమి.

వంది మీరు చదివిన అభిప్రాయములలో బ్రహ్మమూర్తి జేసిన అపచారమేది గాన్పింపదే.

జంబు మీకు గాన్పించదు. మీరును వాడును సహాధ్యాయులేకదా?

మ॥ ఒక దుర్మార్గుడు రాజ్యమున్ జెరుపనేమో కొన్ని దుర్బోధలన్
ప్రకటింపంవిని సంఘమై ప్రజలు నల్ప్రాంతంబులట్లూనుచో
సకలైశ్వర్యములెట్లు దక్కునిదో మోనంబెల్ల యానీ మలన్
దికగాన్పించును నీకు, నీయెదుటనే నీడ్పించి దన్నింపగన్.

సరియే (కాగితముపై వ్రాసి) రాజభటులారా.

భటులు [ప్రవేశింతురు] (కాగితము వారలచేతికిచ్చి) మీరు త్వరగా వెళ్లి ఆ రాజద్రోహుల నెల్లను కారాగార బద్ధుల జేయుడు. జాగ్రత.

(సేవకులు వెళ్లుదురు) [తెరవ్రాలును.]

ప్రవేశము.

బ్రహ్మ. భారతీయులారా! రైతు సోదర సోదరీ మణులారా,

సీ॥ రైతుసోదర దేశరక్షకులై మన
దేశీయవిద్య శోధింపుడయ్య
కర్షకజనులార కార్యసాధకులౌచు
ప్రాప్తైన సంస్థ గాపాడుడయ్య
భూస్వాములార మీబుద్ధిబలంబు చే
స్వాతంత్ర్యదీక్ష సాధింపుడయ్య
కార్మికస్వారాజ్య కల్పితసౌధమ్ము
నిర్మించుటే మీదుధర్మమయ్య

గీ॥ చచ్చుదాస్యము మీకెట్లు నచ్చునయ్య
కుచ్ఛితపు రాజ్యతంత్రముల్ గూల్చుడయ్య
అచ్చమగు ధీరసంపద హెచ్చునయ్య
స్వేచ్ఛజీవులు రైతులై చెలగుడయ్య ॥

మీస్వాతంత్ర్య సౌభాగ్యములకై సంఘైక్యత నెలకొల్పుడు.

భటు. (తొందరగా ప్రవేశించి) బ్రహ్మమూర్తి [అనికాగితమిచ్చును]

బ్రహ్మ. (చదువును) నీవు రాజద్రోహివి. నీవు బంధింప బడెదవు. క్షమా పణగోరి ప్రచారముమానుము. లేదేని కారాగారమునకుబొమ్ము. (అని చాలించి భటులవైపుజూచి) క్షమాపణ గోరను, ప్రచారము మానను. మీయిచ్చ వచ్చినట్లొనర్చుడు.

భటు. బ్రహ్మమూర్తీ! చేతులు జాచుము.

(బ్రహ్మమూర్తిని బంధించుకొని వెళ్లుదురు.)

(గోపాలాచార్యులు ప్రవేశము.)

గోపా. ఆర్యా! ప్రపంచ సృష్టికి మూలాధారమైన ఆయుర్వేద శాస్త్ర మభివృద్ధి జేయుడు. అదియే మనకైశ్వర్యములు సమకూర్చును. ఓషధీప్రభావాది రసధాతుమయమై ఖేచరాదిశక్తుల మూర్తిభూ

తమైన దాయుర్వేదము పరకాయ ప్రవేశ విద్యల కాలవాలమై జరామరణ రహితంబైన జాహ్నవి ఆయుర్వేదము కనకమణిమయాది ఐశ్వర్యములనొసగు కామధేనువాయుర్వేదము. వేద వేదాంత స్వరూపమై వెలసిల్లు అచంచల దివ్యజ్యోతి యాయుర్వేదము. అకాలమృత్యుదోషములకు, అమృతసారమాయుర్వేదము యిట్టి మహోత్కృష్టమైన వేదమును యీదుష్ట జంబుక పరిపాలన నశింపజేయుచున్నది. యిట్టి దుష్టత్వము దెలిసియు తెలియనివారి వలె చూచుచుండుట భారతీయులకు స్వధర్మ విరుద్ధము కదా! మన పూర్వచరిత్రలు వినుచుండుటలేదా?

సీ॥ సృష్టికే ప్రతిసృష్టి సృజియించె స్వర్గమ్ము
కౌశికుండే వేద కౌశలమ్ము
స్వచ్ఛంద మృత్యువు సాధించె నవలీల
భీష్ముడే వేదంబు బిగువుచేత
కాయంబులిలనిల్పక కల్పాంతములందాక
రససిద్ధులే వేద రసము గనిరి
సుతుడయ్యె వినుడిలాసుదతి సుద్యుమ్నుడై
వెలసె వశిష్ఠు కే వేద పటిమ

గీ॥ మీనరాజైన సౌబరి మేనుమార్చి
జవ్వనంబొంద చ్యవను ప్రాజమువదేదో
అదియకనుడీ యాయుర్వేద మవనిదాని
సాటివేరొక్కటేది భూస్వాములార ॥
అదియునుంగాక?

చ॥ అయుర్వేదముమూలనైచి బరులన్ యాచించి దాస్యాంధులై
కాయంబుల్ చెడ యల్పసౌఖ్యములకా కాంక్షించి మోహాంధులై
ప్రాయంబెల్ల విలాసమంద చనగా బాశ్చాత్య గర్వాంధులై
రీయన్యాయము, ఎంచకుందురె ఘనుల్ వీక్షించి నిందింపరే ॥
మరియును

మ॥ పరకాయంబవలీల జేర్చు ప్రతిభాపాండిత్య సూత్రంబులా
వరుసన్కల్పన జేయు హేమరసమా వజ్రాది రత్నంబులా
స్థిరమౌదేహము లోషధీ మహిమచే సిద్ధించుకల్పంబులీ
ధరసాధించిన నాటిహైందవుల మేధాశక్తి చాటింపుడీ॥

ఓభారత వీరులారా! ఆయుర్వేద పాఠశాలలు నెలకొల్పుడు. అనాథప్రజల కాపద బాపి యీదుష్టప్రభుత్వమును గనుమాపుడు యిదియే హైందవ ధర్మము.

భటు. (ప్రవేశించి) భిషగాచార్యా! (అనికాగితమిచ్చును)

గోపా. (చదువుకొని) భారతభూమియందుదయించియు క్షమాపణ గోరుదునా! ప్రచారము మానుదునా! నోటిమాటలకు సైతము శిక్ష విధించుటయా! మంచిది నీయిచ్చవచ్చినరీతి యొనర్చుడు.

భటు. (గోపాలాచార్యులు చేతులు జాచగా భటులు బంధించుకొని వెళ్లుదురు)

(ఆనందం భారతీదేవి ప్రవేశము)

(స్వగతము) ఓప్రకృతిమాతా! గౌరీమతల్లీ! నీసేవా ప్రభావమే కదా! భారత నారీరత్నముల భాగ్యోదయము. నీఅనన్యదయారసమేకదా హైందవాంగనల అద్భుతకీర్తి, రత్నగర్భయను, నీసార్థక నామమేకదా! నవరత్న మణిమయ సౌధంబులచే నాణ్యాదివస్తు సముదాయము చేతులతూగినది. ఇట్టి సౌభాగ్యములననుభవించు భారతీయులు నేడు యీలబ్దరాజ్య పరిపాలనచే వుండనిల్లు, పండ మంచము, తినతిండి, కట్టుగుడ్డయు లేక అపోష్యపు నిర్భాగ్యులుగా మారిరి. తల్లీ, యీదుష్ట జంబుకాధిపత్యము హతమార్చి నిబిడ్డల దౌర్భాగ్యమును మాన్పుము. దరిదాపులేని హైందవుల ఔన్నత్యము నెలకొల్పుము. [ప్రకాశముగా]

సోదరీమణులారా! సకలవిద్యాప్రావీణ్య పతివ్రతాస్త్రీ మహిమచే ముజ్జగములనేకాదు ముమ్మూర్తులసైతము ప్రతిఘటించి విజయము సంపాదించి సర్వసౌఖ్యములు చేపట్టవచ్చును. యీనాటి స్త్రీ

పరిభావమే దుష్టశక్తులను హతమార్చును. అదినుండియు హైందవులగు మహిళల ప్రభావముచే సౌఖ్యమునొంది దేశకల్యాణమై భారత నారీరత్నములకీర్తి నాటినుండి నేటివరకు సాక్షిగానిల్చినది. అట్టి దివ్యకీర్తి ప్రపంచమున వెదజల్లుటకు నేడే దీక్షబూనుడు.

సీ॥ సూర్యోదయమునిల్పి సుమతిదీక్షవహించె
　　　　పుడమిపై హైందవ పుత్రిగాదె
సమవర్తునిగెల్చె సావిత్రిదీక్షచే
　　　　పుడమిపై హైందవ పుత్రిగాదె
ఆడింపె ముమ్మూర్తి ననసూయదీక్షచే
　　　　పుడమిపై హైందవ పుత్రిగాదె
అలజయప్రద సంపదలనొందె దీక్షచే
　　　　పుడమిపై హైందవ పుత్రిగాదె

గీ॥ దీక్షబూనిన హైందవదివ్యకీర్తి
అక్షయంబయ్యె పుడమి ప్రత్యక్షమనుచు
సాక్ష్యముంజాటుడీనాటి సౌఖ్యములకు
దీక్షబూనుడు కష్టముల్ దీరుమనకు ॥

ఆనం. అమ్మా! నాఅన్నలగు బాలురకు నాలోచినవి చెప్పమనదవా!

భారతి. అగత్యము వెల్లడించుము తండ్రీ!

ఆనం. (తల్లికి నమస్కరించి) భారతబాలులారా! మన భారతభూమియందు నేడీజంబుక పరిపాలన పవిత్రమైన విద్యల నశింపజేయుచున్నది. విద్యనేర్చుకొనుట పొట్టకూటి దాస్యముగా మారినది. అనాది సిద్ధములైన విద్యలావలద్రోసి మూఢులమైన మనల శాశ్వతదాస్యమున బడవేయుచున్నది. విద్యనేర్చిననేగాని, నేడీదుష్ట పరిపాలన నశింపజేయుట దుర్లభము మనపూర్వులు యేవిద్యలచే దేశకల్యాణమొనర్చిరో యేభాషాప్రబోధములచే దేశకల్యాణమొనర్చిరో అట్టి సకలోత్కృష్టమైన విద్యలనే అలవరచుకొనుడు.

సీ॥ ప్రహ్లాదుడేవిద్య పాఠంబులన్ నేర్చి
దేశదాస్య విముక్తి దేల్చినాడొ
కుశలవులేశాస్త్ర కుశలులై దమతల్లి
దేశాపవాదముల్ దీర్చినారొ
చంద్రహాసుండెట్టి చదువులన్ చదివెనో
దేశమ్ముసాధించి తేజరిల్లె
అభిమన్యుడేభాష లభ్యాసముల్ జేసి
దేశమ్ముకీర్తి దెచ్చినాడొ
గీ॥ అట్టిమనభాష లడుగంటె అంగ్లవిద్య
తల్లిదండ్రుల కష్టంపు ధనముదెల్ల
కొల్లగొట్టును దాస్యమే గోరుచుండు
హానిపవిద్య మానుడో బాలులార ॥

భటు. [ప్రవేశించి] యేయ్, అబ్బాయ్, (చేతికర్రతో ఆనందం తలపై గొట్టును.

ఆనం. అమ్మా! అమ్మా! అని నేలపై బడును.

భారతి. ఆనందం! ఆనందం! అమ్మో, (అని ఆనందం యొద్దకు పోబోవును.

భటు. యేయ్? (అని భారతీదేవికి అడ్డువచ్చును.) ఆనందుని చేతులకు కట్టుకొని యీడ్చును.

భారతి. అన్నలారా, నాఆనందం,

(భటులు భారతి చేతులను బంధించి ఒకవైపు ఆనందుని బంధించుకొని వెళ్లుదురు.

తృతీయాంకము సంపూర్ణము.

# చతుర్థాంకము.



రాజస్థానము, మంత్రులతోసహా కూర్చొని యుండును.

(తెర ఎత్తబడును.)

జంబు. వందీ, యెంత యోచించినను ప్రయోజన శూన్యముగా నున్నది. మరణ శాసనములకు లొంగని ప్రజలను మట్టుపెట్టు వుపాయమె య్యదియుతోచకున్నది. యేమిచేయుదము.

వందీ, నీవు సమ్మతించి నట్టయిన నేనొక యుపాయము సెప్పెద ఏమం దువా!

తే॥ శిక్షవదలించి స్వేచ్ఛగా చెలగుడంచు
మీరె ప్రతినిధులై రాజ్య మేలుడంచు
సైన్యమొసగిన శత్రువు చేరుననుచు
రాయబారులపంపు స్వరాజ్యమనును ॥

ఈసమయంబున నిదేతగు వుపాయము కొన్ని అధికారములైనను నిచ్చి ఓదార్ప వలయును.

జంబు, భేష్ ప్రతినిధి అన్న ఇట్లుండవలయు. మంచిది నీవేపోయి, ఈకా ర్యము నెరవేర్చుము. (అని కాగితముపై వ్రాసి) రాజభటు లారా! (ప్రవేశించును) కాగితమునిచ్చి, ఇందుదహరించిన వార ల కారాగారమునుండి వదలిపెట్టుడు.

(అని అందరు నిష్క్రమణ)

భటు. (భటుడు ఆనందుని చేతులకు త్రాడుగట్టుకొని ప్రవేశించును) యేమిరా? అబ్బాయ్, యింక ప్రజలకు చెప్పటం మానుకొం టావా! నిన్ను వదలేచ్చాను. లేకుంటే తల చిదుగగొట్టి పురితీ స్తాం. ఏంజెప్తావ్, (అని త్రాటిని గట్టిగా లాగును)

ఆనం. ఈగుడ్డి బెదరింపులకు భయపడెద ననుకొంటివా!

చ॥ చెరయందుంచిన శిక్షజెప్పిన మరే శతల్ ప్రయోగించిన
న్నురిదీయించెదనన్న లొంగనుసుమాఓ మూర్ఖ ధైర్యాప్తిచే
మరణంబన్నను భీతిగల్గదుర మీ మారీచదుస్తంత్రముల్
ధరపై గూల్చెదమింక దాస్యమది మాధర్మంబుగా దెప్పుడున్ ।
వీరికిపందల బెదరింపులకు భారతపుత్రు లెన్నడును భయపడరు. యేమిచేసెదవో చూచెదను.

భటు. నిన్ను వదలిపెట్టమని యాజ్ఞయైనది. యిక మీద నివాసములకు వెళ్లవచ్చును.

అనం. నివాసమూ? మిమ్ము వనవాసముల కంపువరకు మానివాస మిదియే. మరియాద దక్కించుకొని మాతల్లిగొద్ద చేర్చుము.

భటు. వెళ్లవోయ్! నీదుస్తులు ఇచ్చివేస్తాం.

(నిష్క్రమణ)

(ప్రవేశము బ్రహ్మమూర్తి)

బ్రహ్మ. భారతీయ సోదరులారా! చూచితిరా, ప్రభుత్వ దుర్మార్గములు ఏదియో కుతంత్రము పన్నుటకు మమ్మెల్లర చెరవిడిపించి బయటకంపనెంచిరి. సరియే! ఎన్ని కుతంత్రములైనను మనలక్ష్యసిద్ధిని నొంచింపనేరవు. ఒక్క స్వతంత్ర జీవనమే మనలక్ష్యము. సర్వోత్కృష్టమైన కృషి, విద్య, నశింపజేయుచున్నది ప్రభుత్వము. మీరొనర్చు కృషి విద్య, అనన్యమైనది.

సీ॥ అలనాడు శ్రీకృష్ణు డాలమందలబెంచి
సాటిరాజులకెల్ల మేటియయ్యె
బలరాముడనిశమ్ము బట్టి నాగలిచేత
సాటిధనులమించి మేటియయ్యె
పోతనామాత్యుండు పొలముదున్నినరైతు
సాటిభక్తులలోన మేటియయ్యె
ఆశ్రమంబులకెల్ల ఆధారమైకృషి
సాటి ఆశ్రమముల మేటియయ్యె

గీ॥ పసులపోషించి నాగలింబట్టిపుడమి
రైతులే రాజయోధులై రాజ్యమేలు
పుణ్యభూమికి పుత్రులై పుట్టిమీరు.
దాస్యమునజిక్కి విలపింప దగదు వినుడు ॥

ఈదుష్ట జంబుక పాలనమే రైతునకు గ్రహణ దోషము. ఈదోషము నశించుటకై మీ సంఘైక్యత నెలకొల్పి ఏకసంఘమై మీచేజేత ఒక్కతరి అర్ఘ్యమిడుడు. ఎంతటి బలవంతమైన గ్రహణదోషమైనను పటాపంచలై ఈశ్రీ సౌభాగ్యములు, మీచేజిక్కును ప్రభుత్వ రాజకీయసమాచారములకు జన్మకూడదు. యీనీచ దాస్యముకన్న నిలువున ప్రాణములు వీడుట మంచిది. నేయావద్భారత రైతు మహాసభకు బోవుచున్నాడ. మరువకుడు.

[అని వెళ్లును]

[భారతీదేవి ప్రవేశము]

భారతి. భారత నారీరత్నములారా! ప్రభుత్వ పెత్తనములకు జిక్కి మీ సౌభాగ్యములు దూరమొనర్చుకుడు; స్వాతంత్ర సిద్ధికి మీశక్తియే మూలాధారమైనది. మీరు సహాయ పడకున్న స్వాతంత్ర సంపద లెప్పుడును చేకూర నేరవు.

సీ॥ దేశసంపదనింపు దివ్యశక్తులకెల్ల
ఆధారమమ్మ మీఆత్మశక్తి
అరయ సంసారాబ్ధి సవలీలదాటింప
ఆధారమమ్మ మీఆత్మశక్తి
స్వాతంత్ర్యసంపదల్ సాధించుటకునేడు
ఆధారమమ్మ మీఆత్మశక్తి
భారతావనిదాస్య భారంబునొలగింప
ఆధారమమ్మ మీఆత్మశక్తి

గీ॥ యుక్తిచేమీరు చేయూతయొసగపతుల, భక్తిమైసంఘమున చేర్చిబానిసయగు।
వ్యక్తిదాస్యవిముక్తులై యలరమీరు। శక్తిజాడజల్లుడమ్మరో సాధ్వులార ॥

గీ॥ యుక్తి చేమీరు చేయూత నొసగి పతుల
భక్తి నైసంఘమున జేర్చి భానిసయగు
వ్యక్తి దాస్యవిముక్తులై యలరమీరు
శక్తి వెదజల్లుడమ్మరో సాధ్వులార ॥

నేనిదే యావద్భారత మహిళాసంఘ సభకు యేగుచున్నాను. మీరు సహాయపడి చేయూత నొసగుడు. ఈదుష్టపాలన నశించు కాల మాసన్న మైనది. తుదిసారి సమరమిది. మరువకుడు. నేపో యివచ్చెద. [వెళ్లును.]

సభామందిరము,

బ్రహ్మమూర్తి, గోపాలాచార్యులు, వంది కూర్చొని యుం డగా (తెరఎత్తబడును)

బ్రహ్మ. (లేచి) వందీ, యేల యీ సుదీర్ఘ రాయభారము సంపూర్ణప్రజా స్వాతంత్ర్యమె మేము కోరునది. ఇట్టి భానిసరాజ్యమునికాదు.

ఉ॥ తాతలనాటినుండియు కుతంత్రములల్లుచు రాజ్య మేలుచున్
భీతిలజేసి వీరులను భీరులకైవడి మార్చి నేతలై
ఖ్యాతిగడించు కుత్సితులు గాంతురె ధర్మవులన్య సౌఖ్యముల్
బూతులనగ్గడింపు వినబోమిక మొసపు బుజ్జగింపులన్ ॥

ప్రపంచ క్షేమము గోరితి రేని ప్రజాప్రభుత్వము నెలకొల్పుడు. లేదేని ముందర నేకములగు చిక్కులు వాటిల్లును. అవల పరితపించిన ప్రయోజన ముండదు. మేము సభ కేగ వలయు. పోవుచు న్నాము. [నిష్క్రమణ]

వంది. ఇక ఏమి బోధించినను ప్రయోజన ముండదు. నేనేగి జంబుకుని అజ్ఞానమును జాపెడు దారిజూచెద [అని వెళ్లును]

రాజాస్థానము

జంబు. [ఆలోచనతో కూర్చొని యుండును.]

వంది. (ప్రవేశము)

జంబు. (మెుదు రేగి) వందీ, కూర్చొనుము. యెట్టి ప్రయాసలకు లోనైతి వో కదా!

వంది. మీరిదివరకే చెప్పియుంటిరికదా! కష్టపడినవారికే ఫలమని, మనము కష్టపడినందుకొక ఫలము దేలినది.

జంబు. ఏమీ! అంతుల కష్టపడ జేసితివా!

వంది. ఆలోచన లెల్లన మాయమైనవి, ఇక ఈఅహంకార దృష్టి మరల్చుకొన వలయును.

చ॥ వసతినెగోరితీవు దలవాకిలిమార్గము లేని కొంపయా
పసగలగూడునల్లితి ప్రవాహము నేరసి పట్టుపుల్లువై
మసలుచు లోనజిక్కినడి మగ్గెడు కాలము జేయుచుయ్యో నే
దెసబరికించినన్ బ్రళయ దేవత బైబడు విన్నవాక్కృతిన్ ।

[తెరలో]

స్వతంత్ర భారతక్కుజై. దేశనాయకులకుజై, భారతమాతకుజై, అను శబ్దము వినబడును.

జంబు. (దిగ్భ్రమతో!) వందీ ఏమా? ప్రళయ కల్లోలము

వంది. మన అజ్ఞానధనేమణాగ్నిలో క్రుంగి తెప్పరిల్లిన హైందవ వీరుల స్వాతంత్ర్యేచ్ఛ ప్రవాహ గర్జనము శాశ్వత సౌఖ్యమునునీమోసవు సౌధమిక క్రుంగు కాలము సమీపించినది.

జంబు. (వణకుచు) వందీ! ఇక నిర్వహించు మార్గము దెల్పుము. నీవే మార్గదర్శకుడవు.

వంది. అటులైన దేశనాయకుల రావించి సర్వస్వము ప్రజా ప్రతినిధుల స్వాధీన మొనర్చుము. సర్వ ప్రపంచమునకు సౌభాగ్యము కల్గును. ఇదియే మనము మనుట కుపాయము.

జంబు. నీయిచ్ఛ వచ్చినట్లొనర్చుము. నాకేదియు తోచుట లేదు.

వంది. ఇదే నేవెళ్లి, దేశనాయకుల దోడ్తెచ్చెద. ప్రజా సంఘముల నోదార్చెద. నీవు నిశ్చేష్టితుడవై, యుండవలయు.

జంబు. మంచిది చూతము. పోయిరమ్ము.

వంది. చూచుటమాని, ఆచరింప వలయును, అన్యథా పరివర్తించిన అజ్ఞానాగ్నిలో కృంగెదము. ఏమందువు, సరియే, పోయెదము.

(తెర లో)

(యావద్భారత రైతు మహాసభ)

(యోగి, బ్రహ్మమూర్తి, భారతిదేవి. ఆనందం, గోపాలాచార్యులు కూర్చొనియుండగా తెర ఎత్తబడును)

బ్రహ్మ. (లేచి) సోదరసోదరీ మణులారా, నేడీస్వాతంత్ర్యోద్యమ మహాసభ నిర్విఘ్నముగా జరుపుటకు శ్రీయోగానందులవారాధ్యక్షత వహింతురు. (అని నమస్కరించును)

యోగి. (లేచి) భారతీయులారా! మీయిష్టానుసారమే అధ్యక్షత వహించెద. దేశ కల్యాణార్థము శ్రీభారతీతలు ఆనందమూర్తి ప్రారంభించును.

ఆనం. (చేతులు జోడించుకొని లేచి) భారతమాతకు జై, హైందవ వీరులకు జై.

అని పాట పాడును.

యోగి. (లేచి) దేశదాస్య విముక్తి సూత్రములు బ్రహ్మమూర్తి గారు వెల్లడించెదరు. (అని కూర్చొనును)

బ్రహ్మ. సోదర సోదరీ మణులారా! మీరీ నీచ దాస్యమునుండి విముక్తి పొందవలయు నన్న మున్ముందు వృత్తి, మత, వ్యాపారములను విభేదములను పాటింపక ఐక్యతా పూరితమైన బ్రతిమత్రుణఅలవర చకొనుడు. అహింసాస్త్రమునుచేబూని స్వాతంత్ర్యసమరమునకు సిద్ధముగుండు అదియే దుష ప్రభుత్వము నంతరింపజేయు తుది సమరము. కుతంత్ర పదవీ వ్యామోహములను కాలదోసి మీ దేశము మీస్వాతంత్ర్యము మది వసుమ రత్నగర్భ యను మనతల్లి సార్థక నామము నిరూపించుడు. భారత వీరులై బానిసత్వమున ఎడిచియుండిరను అపవాదము రూపుమాపుడు. నేడే సంపూర్ణైక్యత నెలకొల్పి సర్వసౌభాగ్యముల ననుభవించుడు. అదియే

భారత వీరత్వము. వీరాధి వీరుల వైభవము.

వంది. (ప్రవేశము) యోగీంద్రా నమస్కారము. బ్రహ్మమూర్తి ధన్యవాదములు.

బ్రహ్మ. (వంది కెదురేగి) మిత్రమా కూర్చొనుడు ఏమీ? నీవరుదెంచుట నాశ్చర్యముగా నున్నది. అఘాతకుడు నిన్నును మంత్రిపదవిని వదలించెనా?

వంది. లేదు. అతని అజ్ఞాన మడుగంటినది, మీపూలమున దేశ కల్యాణ మొనర్చు ప్రతిభా లేఖలు పొడసూపినవి. నావెంట సత్వరము దయచేసి యీ ప్రజాసమ్మతమైన ప్రతినిధి రాజ్యము నెలకొల్పుడు. సత్వరము పోవుదము రమ్ము.

బ్రహ్మ. వందీ! ఏమి వింతగా మాటలాడెదవు.

గీ॥ అవనిపాలించు సుక్షత్రియాన్వయంబు
లైకమత్యమ్ము చెడగ మాయవనిజొచ్చి
జుట్టుగడ్డంబులకు ముడిజుట్టివైచి
నేతయైనట్టి, ఖలుడెట్టు నీతిబడయు ।

ఆ ప్రజావంచకుడగు లుబ్ధుడు ప్రపంచ క్షేమమును కోరెనా? లేక నీవు భ్రమపడు చుంటివా!

వంది. భ్రమపడు దౌర్భాగ్యపు కాలమంతరించినది. (బహ్మమూర్తీ,

మ॥ వినుమాలుబ్ధగజంబు జంబుకుడయా వీక్షింపనవ్వానికిన్
ఘనమా అంకుశమై మదంబుడిపె మీగాథంపునద్దక్షయే
యనుమానంబిక లేదు సత్యమిది శ్రీయార్యోత్తమాశీఘ్రమే
జనుమా నేవెనువెంట వచ్చెద వృథాజాగేలధీరాగ్రణీ ।

గావున త్వరగా వెడలుదము, పోవుదము రమ్ము.

అందరు. స్వతంత్ర భారతకుజై, (అని ముమ్మార్లు అందురు)

[తెరపడును)

రాజస్థానము.

(లబ్ధరాజు జంబుకుడు గూర్చొనియుండ తెర ఎత్తబడును.)

(ప్ర వే శ ము)

(యోగి. బ్రహ్మమూర్తి గోపాలాచార్యులు, వంది, భారతి, ఆనందం)

జంబు. (లేచి) అయ్యలారా కూర్చొనుడు?

వంది. కూర్చొనుటటుండనిమ్ము, ఇక నీకుతంత్రములకు స్వస్తి జెప్పి వర్తిజా పరిత్రినిధులకు రాజ్య మప్పగించి ప్రపంచ క్షేమమునుపరి కించుము.

జంబు. (లేచి) మునీంద్రా, నమస్కారము. బ్రహ్మమూర్తి, క్షమించుము.

బ్రహ్మ. (కోపముతో) ఒరీ! దుష్టా ఏ క్షమించుము.

చ॥ పరమపవిత్రులౌ ప్రజలపాలనముండిన భారతావనిన్
శిరిధర సంపదల్ గొని కృశించెడుమాయలు బన్ను చోరుడై
దొరనని సంతసించితివి దోర్బల గర్వము చేత వీరులన్
చెరనిడి హింసజేసితవిచెల్లకనన్ క్షమగోరుచుంటివా ॥

ఓరీ! ప్రజావంచకుడగు రక్కసీ

చ॥ కూడునుగుడ్డలేక మరికుందుచు చచ్చినవార లెందరో
వీడిరి భార్యలన్ సుతులవీసుల కొందరు త్యాగశీలురై
చెడియు లెందరో బతుల జెరంట కేసియు దారలేమిచే
ఊడిచిసీదుమూలమున నోరచ రాత్మపశ నిన్ క్షమింతుమే ।

యోగి. భారతపుత్రా, శాంతింపుము

చ॥ అనయమహింస దీక్ష గొనుటన్ముభరిశ క్షితిలుటం పు సైంకవుల్
గనుగొని యాచరించి రదకాంచుమ యమ్ము వె దుష్టపాలనల్
జనుటకుమూలమై వెలసె చయ్యనచోశరం యహింసయస్త్రమై
మనకుసహాయమైన నదిమానుట ధర్మముగాదు సైంధవా॥

అదియునుగాక

గీ॥ వృక్షి అపకారి తనచేరజక్కి నేని
హింసజేయక సన్మార్గహితపుగరపి

మానసము క్రూరమని యనుమానమున్న
వదవిదొలగించుటే ధర్మపదపు శిక్ష!

గోపా. మునీంద్రా! యిట్టి దుర్మార్గుని క్షమించుమంటిరా

గీ॥ దుష్టునకు నీతిబోధించి దునుమకిడిన
మరలచెలరేగి ప్రజలమాడ్చుకున్న
యట్టి ధర్మమె మనకు నేడిట్టులయ్యె
యిప్పుడాధర్మముల నీడుటొప్పునమ్మ ॥

యోగి. (నవ్వి) ఆచార్యా! శాంతముగా ఆలోచించుము. సామదానభే
దండనలను చతురోపాయములు గలవు. అందులో సామాదిము
దునుపాయముల చేతనె యీతడు శరణు వేడెను. అట్లు లొంగ
ప్రజా కంటకుడగు శత్రువే దండనార్హుడు, నట్టి దుర్మార్గుల యె
వెనుదీయక రణరంగమున జయించుట హైందవ ధర్మము. కాని
యీశరణాగతుడు దండనార్హుడు గాడు.

బ్రహ్మ } మీయాజ్ఞ శిరసా వహించితిమి, క్షమించుడు.
గోపా }

జంబు. (లేచి చేతులు జోడించుకొని) బ్రహ్మమూర్తీ, నాఅపరాధము
మన్నించుము. మీకార్యదీక్ష అనన్యమైనది. ఇదే నాకుగల
సర్వ రాజ్యాధికారములును మీకప్పగించితి. ప్రజా సమ్మతమగు
ప్రభుత్వము నెలకొల్పుడు. (అని కాగితముపై వ్రాసియిచ్చును)

అందరు స్వతంత్ర భారతుకుజై (అని ముమ్మారనందురు)

యోగి. ఇక పరిపాలించదగు ప్రతినిధిని కోరుడని ప్రజలకు తెలియునట్లు
జేయుడు.

జంబు. మంచిది, రాజభటులారా,

భటు, (యిరువురు ప్రవేశింతురు)

జంబు, మరిందలి వృత్తాంతము ఎల్లరకు తెలియ జేయుడు. (కాగితముపై
వ్రాసి భటుల కిచ్చును,

భటుల నిష్క్రమణ. (తెరవాలును)

భటులు. (టాం, టాం వేయుదురు.)

ఓహో! భారతీయు లందరికి తెలియజేయడ మేమనగా! ఈ దినంనుండి పరిపాలనము మార్పడ మైనది. అందులకై ప్రజలు యెవరిని కోరుదురో వారినే పెద్దమంత్రిగా నియమించ బడును. ఈదినం మొదలు 15 దినములకు లోపట మీ అందరి అభిప్రాయములు తెలుప వలసినది. మీరు తెలుపుటకు తగువసతులు యేర్పాటు చేయబడును.

అని వెళ్లుదురు.

చతుర్థాంకము సంపూర్ణము.

---

# పంచమాంకము.



బ్రహ్మమూర్తి, యోగి, లబ్దరాజు కూర్చొనియుండ తెరయెత్త బడును.

జంబు. భారతీయులారా, మీరుకోరిన మేరకు శ్రీ బ్రహ్మమూర్తి గారే ప్రధాన మంత్రిగా నైరి. మీ రాజ్యమిక మీరలు సుఖముగా పరిపాలించు కొనుడు.

అందరు. భారతమాతకుజై. ప్రధానమంత్రి శ్రీ బ్రహ్మమూర్తికిజై.

యోగి నీవీ సింహాసన మధిష్ఠించి అయిదు సంవత్సరములు ప్రజా సమ్మతముగా రాజ్యపాలన మొనర్చి పిమ్మట ప్రజలు కోరిన ప్రతినిధికే రాజ్యమప్పగింపుము.

బ్రహ్మ. ప్రజోద్ధారకుడగు యోగీశ్వరునకుజై. సోదర సోదరీ మణులారా

మీసౌఖ్య సమ్మత రాజ్యపాలన మొనర్చుటకు ప్రమాణము గై కొంటి క్షమించుడు.

అందరు. శ్రీబ్రహ్మమూర్తిగారికి జై. (అని ముమ్మార్లు అందురు) బ్రహ్మమూర్తి సింహాసనముపై గూర్చుండును. పోలెస్ సబ్ యిన్ స్పెక్టరు ప్రవేశము.

యిన్స్. (నమస్కరించును)

బ్రహ్మ మీరెవరు?

యిన్స్. అయ్యా, నేనీ పట్టణము నందలి పోలీస్ అధికారిని. పదవీవ్యామోహమున మీను మబ్బుగప్పి నేలపడి యుండ యోగిని బెదరించి మీసొత్తులెల్ల సపహరించిన ద్రోహిని. ఈ జంబుకుని అక్షి కులొంగి అట్లొనర్చిన అపరాధిని. (బ్రహ్మమూర్తి సొత్తులెల్ల బల్లపై బెట్టును.) ఇవి మీసొత్తులు. మీకోరినట్లు నన్ను శిక్షించుడు. నేను నిజమైన ప్రజాద్రోహిని. (అని చేతులు జోడించి నిలచును.)

బ్రహ్మ. యోగీంద్రా, వినుచుంటివా యీతని వృత్తాంతము.

యోగి. అవును. యిట్టివింకెన్ని బయల్పడ నున్నవో చూడవలయు, గాని ఈతనికి జ్ఞానోదయ మయినది. నిష్కపటి యయ్యెను. ఈతనినే గూఢచారిగ బంపి లంచగొండుల నెల్ల బట్టి తెమ్మని ఆజ్ఞ యొసంగుట మంచిది.

బ్రహ్మ. సరియే! సోదరా! నీవేజని లంచగొండుల నెల్ల బట్టి తెమ్ము.

యిన్స్ ఆజ్ఞ. (నిష్క్రమణ)

బ్రహ్మ. మునీంద్రా, ప్రజాద్రోహములలో జంబుకేశ్వరు డొక్కడే కర్తయందువా!

సీ॥ మంచిమార్గములేక మరిచెడుమార్గమౌ
కాంక్షించువాడొక కార్యకర్త

ధర్మముంచెంచియో ధనమునార్జించియో
కాజేయువాడొకడు కారకుండు
పరులక్షేమార్థమో వారిసౌఖ్యార్థమో
పెరవారినుసిగొల్పు ప్రేరకుండు
మోహమేనియెనో మోమాటముంచెనో
ముదమున్నవాడను మోదకుండు
గీ॥ కర్తయామోది ప్రేరిత కారకుడను
వారునల్వురు సములుయే పనులకైన
సుకృత దుష్కృతములకిట్లు సూత్రిఫణితి
గానవీరెల్ల సములు దుష్కార్యములకు ॥

ఈ: లగుశికిశిక్ష సమాన మనుట ధర్మము ఇకధర్మసూత్రమైు నిష్కపటుల నెరింగి శిక్షించ కుండుట.

(యిన్ని స్పెక్టరు, శాస్త్రీ, శెట్టి, రెడ్డి, సాహెబ్, డాక్టరు, కల్లుఅంగడియజమాని, కారు, మారుల చేతులకుకట్టి ప్రవేశించును.

**బ్రహ్మ** వీరెల్లరు అంచగొండులేనా.

**యిన్ని.** అవును. (అని ఒక్కొక్కరిని విశదముగా చూపించును) వీరిద్దరు భారతీదేవి మంగళ సూత్రమును దౌర్జన్యముగా లాగినవారు ఈతడు కల్లుదుకాణపు యజమాని. యీతనివద్దనే యీమంగళ సూత్రము చేరినది. మంగళ సూత్రమును విక్రయమునకు కొన్నవాడితడు, యిట్టి కార్యములకు చేయూత యొసంగు భాగస్వాములే మువ్వురు. భారతీదేవి సొత్తులు వీరియింటనే దొరికినవి, ఇతడే యింగ్లీషు డాక్టరు. (మంగ సూత్రములు, సొత్తులు, బల్లపైనిడి) ఇది ఏమంగళసూత్రము. సొత్తులు.

**బ్రహ్మ** ధర్మబద్ధముగా విచారింపుము.

**యిన్ని** (అపరాధుల నుద్దేశించి) దేవుని యెదుట ప్రమాణముచేసి నిజం చెప్తాను. అబద్ధం చెప్పను. (అని అందరితో పలికించును.)

ఏం బాలక్రిష్ణమ్మ, చెట్టిగారి మంగళ సూత్రమేగాక యింకా చోరీ సొత్తులు కొనుట వాస్తవమేనా?

శెట్టి. ఇదుగిది అన్యాయమూంట, కొప్పడాకక్రి. ఈంత్లాలా లంచాలిచ్చి ఇండ్లు దొంగిలి మందివిముంచి నొల్లుండగా, ముందు బాలకిష్టమ్మ అన్నదానికే మొక్కాలీసిందట. కొపగిచ్చుకో గూడదు. ఈమాటగూడ మీరు చెప్పొద్దూంటె వూరుకుంట కొప్పడాకక్రి.

యిన్ని. అన్నీ ముందే మెల్లబాడితివే! వూరుకుండే దెవ్వడు.

శాస్త్రి. (చిన్నగా) ఉన్నసంగతి వున్నట్లు చెప్పరా, యింకా నిన్నీ పెద్దమ్మ వదల్లేదేం.

రెడ్డి. ఎదుకొదుల్తుంది, చేసిన మోసాలకు చెంపకాయల్ తింటేగాని మనల వదిలేది.

సాహెబ్. అరే, క్యా కుస్ కుస్ కుస్ కుస్ మాకే తెల్వదు. హమ్ పభిభుత్వం హమన్నెన్ని రోజుల్ ఘడ్డితిన్యాం. అరే సేసింది మోసం హమార యేకీచ్ బాత్.

యిన్ని. ఆ, అవును. యదార్థం చెప్పడమే, అందరకు మంచిది. శెట్టిగారు చూడండి. మీసొత్తులు దొంగలుతీసుకెళ్తే మీకుసంతోషమేనా

శెట్టి. మీదయ సల్ల గున్నంతసేపు మాఇంట్లో సొరీ ఎందుకు జరుగుతుందింట.

యిన్ని. పోనీ ఒకవేళ అట్లు సంభవిస్తే మీఅభిప్రాయమేమి?

శెట్టి. అబ్బే ఆమాట అనుకోగూడ్దూంట, కొప్పడకక్రి. (అనినవ్వును

యిన్ని సరే, మంగళ సూత్రిముగాక యింకా చోరీసొత్తులు గొనుట వాస్తవమేనా!

శెట్టి. (కోటు జోబిలోనుండి నోట్లకట్ట లంచముగా చూపును)

యిన్ని. నిన్నొదిలేస్తె అనోట్లన్ని నాకిచ్చేదలచు కొన్నావా శెట్టి.

శెట్టి అబ్బే లేదండి వసిపోయినాయేమోనని సరిచూచుకొంటి.

సాహెబ్. అరే మల్లానోట్లు సూపిచ్చి ఖూన్లమన్ను పోస్తుండావ్. శా

'దలిందరం తగిలిందిరే భై.

యిన్ని. డాక్టరుగారు, మీఅభిప్రాయమేమి?

డాక్టరు, (జోబిలోనున్న జాబు యిచ్చును.

యిన్ని. (చదువుకొని) జంబుకేశ్వరా, ఈజాబు నీభార్య కాంతమ్మగారు వ్రాసినదేనా?

జంబు. (లేచి చేతులు జోడించుకొని) ఈ కార్య మంతటికిని నేనే కారకుడను. మీకోరిన శిక్ష యొసగుడు.

బ్రహ్మ భారతీదేవి సొత్తులవహరించుటకు నీవే యాజ్ఞ యొసంగితివా!

జంబు. అవును.

యోగి, బ్రహ్మమూర్తి, జంబుకేశ్వరున కిత్వఁబోవు శిక్ష ప్రజల అభిప్రాయమునకే వదలుడు. [అపరాధుల నుద్దేశించి]

భారత పుత్రులారా!

సీ॥ శ్రీమించుసౌభాగ్య సీమభారతమాత
పుత్రులై మీరలీ పుడమిబుట్టి
నవఖండములకెల్ల నాయకుల్ గానయ్యు
నీచదాస్యమునందు నిలచియుండ
వీతాధివీరులై విజయ సాధనమాని
వంచకవృత్తి యాలంచమడిగి
ప్రజలహింసించసి ప్రభువులై మీరట్టి
ద్రవ్యమార్జించుట ధర్మమగునె

గీ॥ సాటిమనవారు స్వాతంత్ర్యసమరమందు
ధనము ప్రాణమ్ము దేహముల్ ధారవోయ
రోసమించుమంతలేక పేరాసబూన
నజ్జనులఁమిమ్ము ఛీయనసిగ్గులేదే ॥

సేటి, సిగ్గు సిగ్గు (అని చెంపలు వేసుకొనును)

శాస్త్రీ ఆసిగు సిగ్గున్నర, ఇంక సిగ్గులేకుంటె ఇహలోకసౌఖ్యం అడుగం

టినట్లై.

యోగి. (బల్లపైనున్న మంగళ సూత్రము చేతబట్టుకొని) ఓరత్నగర్భపుత్ర స్వాతంత్ర్య యోధులారా!

సీ॥ జనులబాధించెనీ జంబుకుండనువీడు
లబ్ధరాజ్యంభేల లుబ్ధగజము
స్వాతంత్ర యోధుల సమర విజయమనీక్ష
యనివార్యమైనదే యంకుశంబు
భారతాంబకుశత్రుబాధ దప్పించిన
శుభకారి మంగళసూత్రమిద్దె
దుష్టాత్మసతతి కుసిమి భారతభూమి
నైతురతుగ రామ రాజ్యమిదియె
గీ॥ సిరియశంబును సంపదశీలమునకు
సాధమిదె భారతీయులస్వకరలబ్ధ
సారసంసార స్వాతంత్ర్య సాధనంబు
విజయమై సర్వమంగళ విభవమయ్యె।
అమ్మా! భారతీదేవి?

భారతి. సర్వమానవ కల్యాణ మొనర్చిన సాధ్వీరత్నము వైతివి. ఇదే నీ మంగళసూత్రము గైకొని చిరస్థాయిగా సౌభాగ్యము లందుము. విజయీభవ. (అని మంగళసూత్రము యిచ్చి ఆశీర్వదించుచు.) (దివము పరికించి) తల్లీ, క్షీరసాగర పుత్రీ, నీసందేశము దీర్చితి. క్షమించుము. ఇదే నేమీనాశక కరుదెంచు చున్నాడ

పటపాడుచు వెళ్లును,

పంచమాంకము సంపూర్ణము.



| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 13 | గనిగీ | గని |
| 4 | 25 | వరకుడు | వరుడు |
| 5 | 12 | లోధవంగ | లోదవంగ |
| 5 | 14 | బ్రిశ్నల | ప్రశ్నల |
| 5 | 18 | ప్రిపంచము | ప్రపంచము |
| 6 | 25 | గ్రాంతురము | గ్రాంతురంతు |
| 7 | 16 | దసర్థ్వాడు | దసర్థ్వడు |
| 8 | 2 | మార్పుాశ బుట్టైశని | మార్పులు బుట్టైనేని |
| 8 | 3 | నేమమాయుచు | నేమమరయుచు |
| 8 | 4 | వాఠి | వాది |
| 9 | 6 | వర్తనుంచెంత | వర్తనులచెంత |
| 9 | 9 | నెట్లో | కెట్లో |
| 9 | 24 | నీకుటుంభ | నీకుటుంబ |
| 10 | 8 | కాలవిపర్యాసము | కాలవిపర్యాసము, |
| 10 | 9 | జాటు కొంటివా | జుట్టు కొంటివా |
| 11 | 1 | పూజార్థాడేటు | పూజార్థాండేటు |
| 11 | 1 | రాజగుసు | రాజగునో |
| 11 | 4 | ధనమును | ధనమును |
| 11 | 5 | కాలము | కాలమ్ము |
| 12 | 10 | గటిగా | గట్టిగా |
| 12 | 15 | మార్గము | మార్గములో |
| 12 | 21 | అని దృష్టివభియించి | అని దృష్టినభినయించి |
| 14 | 14 | అపదశేదికోటికి | అవధశేదికేటికి |
| 14 | 26 | బరితపించె నీకట్టి | బరితపించె నికట్టి |
| 17 | 7 | చెల్ల | చెల్లు |
| 17 | 21 | ప్రిశ్ర | ప్రిశ్రుడు |
| 18 | 9 | రొట్లు శేగినను | ఎట్లు శేగినను |
| 20 | 25 | (స్వాగశం) | (స్వాగతం) |
| 22 | 25 | అమల్లోశక | అమల్లోశక |
| 23 | 18 | కిటులు | బిస్ట్రులు (బిల్ టులు) |
| 25 | 20 | అదిపంస్కృతీ | అదిసంస్కృత |
| 27 | 18 | ఈశేసమయాంలోన్నో | |
| 28 | 26 | నీని | నీవి |

